# వనిత

డాల్టన్ ప్రచురణ

దశాబ్దానికి పైగా మూడు భాషలలో
వెలువడుతూ వనితల
పురోభివృద్ధికి పాటుబడుతున్న
ఏకైక స్త్రీజన మాసపత్రిక!




డిసెంబర్
1986




జూలై
1975

నేడే చందాదారులుగా చేరండి
మీలో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించే
మీ నెచ్చెలి
**వనిత**
మీ ముంగిటికే రప్పించుకోండి!

సాలు చందా: రూ 36

ఎం.ఓ. ద్వారాగానీ బ్యాంక్ డ్రాఫ్ట్ ద్వారాగానీ పంపవలసిన చిరునామా









Join us for a unique line-up of stamps on Peace and Friendship









Did you know—in the recorded history of mankind, there has not been a single day without war. Peace is a rare commodity. Preserve it in the streets and in your albums. Chinar has an irresistible collection specially imported for genuine collectors like you.

**Choose from over 20 themes**

Special packets have been made for you under various themes or topics ranging from stamps on space, sports, animals, transport, art, flowers etc. (see coupon for details) to add to your collection. Take your pick.

**Send the coupon or simply write to us**

You can either fill in the coupon or choose your favourite topic and write to us on a postcard, inland letter or on plain paper.

- If you order by VPP, minimum order should be Rs. 50.00 + Rs. 7.00 for postage.
- If you pay in advance, minimum order should be Rs. 25.00 + Rs. 5.00 for postage.
- Please add 10% Sales Tax on value of stamps for all orders. (only 7% for Delhi).
- Postage will be free on all orders of Rs. 100.00 or above.
- For VPP orders, make sure of your parents permission.




**Hurry! Mail your order today:**

Circle the packets you want

| Themes | stamps 10 | 25 | 50 | 100 |
|---|---|---|---|---|
| Space | 3.75 | 8.00 | 15.00 | 35.00 |
| Sport | 3.75 | 8.00 | 15.00 | 35.00 |
| Transport | 3.75 | 8.00 | 15.00 | 35.00 |
| Art | 3.75 | 8.00 | 15.00 | 35.00 |
| Flowers | 3.75 | 8.00 | 15.00 | — |
| Fauna | 3.75 | 8.00 | 15.00 | — |
| Marine/Sea life | 3.75 | 8.00 | 15.00 | 30.00* |
| Paintings | 3.75 | 8.00 | 15.00 | — |
| Lenin | 3.75 | 8.00 | 15.00 | 25.00** |
| Flora & Fauna | — | — | — | 35.00 |
| Moscow | — | — | — | 30.00 |
| Siberia & Far East | — | — | 30.00*** | — |
| Peace & Friendship | — | 8.00 | — | 25.00 |
| October Revolution | 3.75 | — | — | 25.00 |
| Assorted | 3.75 | 8.00 | 15.00 | 25.00 |

* 90 stamps ** 85 stamps *** 53 stamps

Name ........................ Age ........
Address ........................
........................
........................

Payment ☐ V.P.P. order ☐

**CHINAR-Sole distributors and importers of USSR stamps for genuine collectors**

STAMPS The hobby that sticks with you

CHINAR EXPORTS PVT LTD
Regd. Office : 101-A, Surya Kiran
Kasturba Gandhi Marg, New Delhi-110 001.

INK CE 891



# చందమామ

ఫిబ్రవరి 1987



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 2-50

సంవత్సర చందా: 30-00

# సూపర్ ఫైటర్స్!






అయన్ని మెచ్చుకునేవార్కు అంటారాయన్ని 'లిటిల్ 'మాస్టర్' అని. కాని ప్రపంచానికి తెలుసు అతను సూపర్ బేట్స్‌మెన్ అని. మరి సునీల్ గావాస్కర్ అంటారు గదా, "నేను సూపర్ ఫైటర్‌ని. మా అబ్బాయి కూడా అలాగే అవ్వాలని నా కోరిక. అందుకే మరి వాడికి చిన్నప్పటినుంచే నేర్పడం మొదలెట్టానిక. ఫోర్‌హాన్స్ టూత్ పేస్ట్‌తో—పిప్పిపళ్ళను నిరోధించే ఆ సూపర్ ఫైటర్‌తో. బేక్టీరియా అన్నది ఆహారపు కణాలపై పెరుగుతుంది. అది అమ్లాలను వదులుతుంది—అవి పిప్పిపళ్ళు అయ్యేలా చేస్తాయి. ఫోర్‌హాన్స్ సూపర్ ఫైటర్‌లో చురుకుగా పనిచేసే ఫ్లోరైడ్ వుంది—అది పంటి ఎనామెల్‌ని గట్టిపరుస్తుంది—దాంతో ఆమ్లం యొక్క చర్యను నిరోధిస్తుంది.

ఇక ఫోర్‌హాన్స్‌లోనే ప్రత్యేకంగా గల ఎస్ట్రింజంట్ అనే పదార్థం ఇగుళ్ళను బిగుతుగా వుండేలా చేస్తుంది. దాంతో పళ్ళకి మరింతగా పునాదిలాంటి గట్టిదనం, మరింత కాలం అలా నిలిచి వుండగలగడమూను.

సునీల్ అంటున్నారిలా—"మా అబ్బాయికి నేను యిస్తాను ఫోర్‌హాన్స్ సంరక్షణ. మరి మీరో?"



**ఫోర్‌హాన్స్**

సంరక్షణ

32 తీరులో వుండేలా

GM-113/86 Tel




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["ముగ్గురువర్తకులకథ"]కు, ఆధారం, మనోజ్‌దాస్ రచన. దేశపాలకులైన రాజులను సేవించడం, నరకప్రాయమనీ, కత్తిమీద సామువంటిదనీ, చాలామంది కవులూ, పండితులూ చెప్పారు. అయినా, జీవనభృతి కోసం కొందరికి, అలాంటి సేవ తప్పదు. ''రాజూ-సేవకుడూ'' అన్న కథలో, రాజాశ్రయంలో బతికే ఒక వ్యక్తి ఎదుర్కొన్న గడ్డుసమస్య చక్కగా వివరించబడింది.

## అమరవాణి

ఆశాయా యే దాసాస్తే, దాసాః సర్వలోకస్య,
ఆశా యేషాం దాసీ, తేషాం దాసాయతే లోకః,

[ఆశలకు బానిసలైనవారు, లోకానికే బానిసలు. అలా కాక, ఆశలను అదుపులో వుంచుకొగలిగిన వారు, లోకానికే నేతృత్వం వహించగలరు.]

సంపుటి 80 ఫిబ్రవరి '87 సంచిక 2

విడి ప్రతి : 2-50 :: సంవత్సర చందా : 30-00

CHITRA



రారెవ్వరూ నాకు జ్వరమని
వేరెవ్వరు నాకింక తోడని
ఆలోచించా నేనేదో చెయ్యాలని
ఇంట్లో అందరి సరదాతీర్చాలని

ఇవిగో పెన్నులు, అదిగో కాగితం
ఎకో రంగులతోనే నాకింక స్నేహం.
గీసేస్తా గీతలతోనే ఓ బొమ్మ
మురిసిపోయి ముద్దివ్వాలి మా అమ్మ

ఎకో పచ్చ, ఎకో నీలం
ఎరుపు పసుపు నారింజ రంగులమయం
ఊదా, నలుపు" వైలెట్
గులాబీ, గోధుమలతో అయ్యేనది ఓసెట్




# ఎకో
## స్కెచ్ పెన్ రంగులే ఇక రంగులు- సరదాతీర్చే హంగులు!

[illegible] 400 057. [illegible] 6040305, 6043556.

## చందమామ కబుర్లు



### మళ్ళీ 'మంచుమనిషి'!

శరీరమంతా రోమాలతో, మానవాకృతిలో తిరిగే 'యేతి' అనే మంచుమనిషిని గురించిన కథలెన్నో చాలాకాలంగా ప్రచారంలో ఉన్నాయి. అయినా ఆ రకం ప్రాణులను కళ్ళారా చూసినవాళ్లు లేరు. ఇటలీకి చెందిన పర్వతారోహకుడు రీన్‌హోల్డ్ మెస్నర్, ఇటీవల టిబెట్ కొండలలో ఒక మంచు మనిషిని చూసినట్టు చెబుతున్నారు. ఆ ప్రాణులను గురించి మరిన్ని వివరాలు సేకరించడానికి ఆయన పూనుకున్నారు।

### పాంపే వైభవం!

ఇటలీలోని వెసువియస్ కొండ క్రీ॥ శ॥ 79 వ సంవత్సరం బద్దలైనప్పుడు పాంపే నగరం భూమట్టమయింది. ఇటీవల జరిగిన పరిశోధనల ద్వారా, పాంపే నగరం ఇన్నాళ్ళు అనుకున్నదానికన్నా ఎంతో సుసంపన్న నగరంగా వెలుగొందేదని తెలియవచ్చింది. విలువైన మణిమాణిక్యాలలో తయారు చేసే నగల కార్ఖానా ఇక్కడ ఉండేదట।





### మొట్టమొదటి లేడీడాక్టర్!

ప్రపంచంలో ప్రప్రథమంగా లేడీడాక్టర్ భారతదేశం నుంచే పట్టభద్రురాలయిందని పి. టి. ఐ. వార్తాసంస్థ తెలియజేస్తున్నది. మిస్ మేరీషెర్లీఫ్‌కి లండన్ మెడికల్ కాలేజీలో సీటు నిరాకరించబడింది. ఆమె మద్రాసు వైద్యకళాశాలలో 1875 వ సంవత్సరం చేరి, నాలుగేళ్ళలో పట్టభద్రురాలయిందని భారతీయ వైద్యసంస్థ అధ్యక్షులు డా॥ వి. పరమేశ్వర తెలియజేస్తున్నారు.

పురాణగాథలు :

# మయూరధ్వజుడు

మణిపురాధీశుడైన మయూరధ్వజుడు అశ్వమేధయాగం చేయాలని, యాగాశ్వాన్ని వదిలాడు. యాగాశ్వం వెంట ఆయన కుమారుడు తామ్రధ్వజుడు సేనతో బయలుదేరాడు. అదే సమయంలో ధర్మరాజు కూడా అశ్వమేధయాగం తలపెట్టాడు. ధర్మజుడి యాగాశ్వం వెంట కృష్ణార్జునులు బయలుదేరారు. తామ్రధ్వజుడు ధర్మరాజు యాగాశ్వాన్ని పట్టి రహస్యప్రదేశంలో బంధించాడు.

ఎలాగైనా యాగాశ్వాన్ని పట్టుకోవాలని, కృష్ణార్జునులు బ్రాహ్మణ వేషధారులై మయూరధ్వజుడి ఆస్థానానికి వెళ్ళారు. మయూరధ్వజుడు వారికి భక్తితో అతిథి మర్యాదలు చేసి, వచ్చిన కార్యం అడిగాడు. అప్పుడు బ్రాహ్మణ రూపంలో ఉన్న కృష్ణుడు, "రాజా, అరణ్యమార్గం గుండా ప్రయాణం చేస్తున్నప్పుడు, హఠాత్తుగా ఒక సింహం నా బిడ్డను పట్టుకున్నది. వదలమని పరిపరి విధాల ప్రార్థించాను. రాజైన నీ శరీరంలో సగభాగం తెస్తే, బిడ్డను వదలగలనని సింహం అన్నది," అన్నాడు.

ఆ మాట వినగానే రాజపత్ని, "భార్య భర్తకు అర్ధాంగి. అందుచేత నా శరీరం తీసుకుని, రాజును వదలండి," అని బ్రాహ్మణులను వేడుకున్నది.

"నిజమే, కాని, భార్య, భర్త వామభాగం మాత్రమే అవుతుంది. సింహం రాజు కుడిభాగం కావాలన్నది।" అన్నాడు బ్రాహ్మణుడు.

అప్పుడు రాజు, "బ్రాహ్మణోత్తమా, మీ ఇష్టానుసారమే నా శరీరంలోని కుడిభాగాన్ని తీసుకుని, మీ కుమారుణ్ణి పొందండి," అన్నాడు. ఆ సమయంలో ఆయన ఎడమకంటి నుంచి, ఒక కన్నీటిబొట్టు రాలింది. దానిని పసికట్టిన బ్రాహ్మడు, "కన్నీళ్ళతో ఇచ్చే నీ అర్ధశరీరం నేను తీసుకోలేను," అన్నాడు.

దానికి మయూరధ్వజుడు, "బ్రాహ్మణోత్తమా! ఉదాత్త కార్యం కోసం శరీరంలోని కుడిభాగం చేస్తున్న త్యాగం, ఎడమభాగం నోచుకోలేదన్న బాధతో ఎడమకంటి నుంచి నీరు కారింది. అంతేకాని, అర్ధశరీరం పోతున్నదన్న బాధతో కాదు," అన్నాడు.

వెంటనే, బ్రాహ్మణ రూపంలో ఉన్న కృష్ణుడు, రాజును కౌగిలించుకుని, నిజస్వరూపం చూపి, ఆశీర్వదించాడు. రాజు పరమానందం చెందాడు. తన యాగం పూర్తయ్యాక, మయూరధ్వజుడు, ధర్మరాజు యాగాశ్వాన్ని స్వయంగా తీసుకుపోయి ఆయనకు అప్పగించాడు.





# నిత్యసంతోషి

సోమశేఖరు డనే రాజుండేవాడు. ఆయన అన్నివేళలా, అయినదానికీ, కానిదానికీ విచారపడుతూండేవాడు. ఒకనా డాయన అరణ్యానికి వేటకు వెళ్ళాడు. సాయంత్రం వరకూ అరణ్యమంతా గాలించినా, ఆయనకు వేటాడేందుకు ఒక్క జంతువు కూడా కనిపించలేదు. దానితో, ఆయన పుట్టెడు విచారంతో, రాజప్రాసాదానికి తిరిగి వచ్చాడు.

సోమశేఖరుడి మంత్రి ధర్మనందుడు చాలా వృద్ధుడు; ఎంతో వివేకి. ఆయన రాజు విచారం గమనించి, ''మహారాజా! రాజులకు వేట అనేది, కేవలం ఒక వినోదం. వేటగాడైతే, ఆకలికొద్దీ, ఏ జంతువూ దొరకలేదని విచారపడ వచ్చు. ఈ రోజు వేటాడేందుకు జంతువు లేవీ కనబడలేదన్న విచారం తగదు,'' అన్నాడు.

అయినా, సోమశేఖరుడి విచారం రవ్వంత కూడా తగ్గలేదు. ఆ మర్నాడు ఆయనా, భార్యా భోజనం చేస్తుండగా, సోమశేఖరుడు బంగారు పళ్ళెంలో వున్న ఏదో కూరను పక్కకుతోసి, లేచినిలబడి, ''ఇందులో ఉప్పేలేదు!'' అన్నాడు.

అందుకు రాణి, ''ప్రభూ, మీకోసం అని వండిన మరి పదిరకాల కూరలు, ఇతర పళ్ళాల్లో వున్నవి. వాటినీ రుచి చూడండి,'' అన్నది.

కాని, రాజు విచారంగా తలాడిస్తూ, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

ఒకనాడు, మంత్రి ధర్మనందుడు రాజుతో, ''మహారాజా, మన నగర పరిసరాల్లోని గురుకులానికి, ఒక యోగీశ్వరుడు వచ్చినట్టు తెలిసింది. ఆయన్నొక సారి దర్శించి రావడం బావుంటుంది గదా!'' అన్నాడు.

సరస్వతి పట్నాయక్



రాజు అందుకు సరేనన్నాడు. ఆయనా, మంత్రీ యోగిని చూడబోయారు.

సోమశేఖరుడు, యోగికి సాష్టాంగపడి లేచి, ''మహాత్మా, నేనొక పెద్ద దేశానికి రాజును. నాకు అనుకూలవతి అయిన భార్యా, బొక్కసం నిండుగా ధనం వున్నది. అయినా, నాకు ఎప్పుడూ విచారం తప్ప, సంతోషమన్నదేలేదు,'' అన్నాడు.

యోగి ఆ మాటలకు చిరునవ్వునవ్వి, ''రాజా, నీ విచారకారణం తెలిసింది. నువ్వు చేయవలసిందేమంటే—ఎప్పుడూ సంతోషంగా వుండే మనిషి వేలి ఉంగరం సంపాయించడం. ఆ తరవాత నీకు విచారమన్నది మరి కలగదు!'' అన్నాడు.

యోగి సలహా ప్రకారం సోమశేఖరుడు, మారువేషంలో, ఒక గుర్రాన్నెక్కి, నిత్య సంతోషి అయిన మనిషిని వెదికేందుకు బయలుదేరాడు. కొన్నాళ్ళు గడిచాక, ఆయన కొకచోట నవ్వుతూ పరవశుడై వున్న, ఒక మనిషి కనిపించాడు.

రాజు అతణ్ణి సమీపించి, ''నువ్వెవరివి?'' అని అడిగాడు.

''అయ్యా, నా వృత్తి పౌరోహిత్యం,'' అన్నాడు మనిషి.

''నువ్వు అన్నివేళలా సంతోషంగా వుంటావా?'' అని అడిగాడు రాజు.

ఆ ప్రశ్నకు పౌరోహితుడు, ''అలా వుండగలిగితే, యిక లేనిదేమిటి! పేద వాళ్ళు పడే బాధలు చూసినప్పుడు, నాకెక్కడలేని విచారం కలుగుతుంది,'' అన్నాడు.

రాజు, అక్కడినుంచి బయలుదేరాడు. కొన్నాళ్ళకు, ఆయనకు ఒక జ్యోతిష్కుడు కనిపించాడు. అతణ్ణి చూస్తూనే రాజు, ''ఇతడు నిత్యసంతోషి అయి వుంటాడు. భవిష్యత్తులో జరగబోయేదంతా ముందే తెలుసు గనక, ఇతడికేదీ ఆశ్చర్యం గానీ, విచారం గానీ కలిగించదు,'' అనుకున్నాడు.

అయితే, రాజు అతణ్ణి నువ్వు నిత్య సంతోషివా? అని అడిగినప్పుడు,

జ్యోతిష్కుడు, "నేను భవిష్యత్తు ఎరిగిన వాణ్ణి కనక, తగు జాగ్రత్తలో వుంటూ, కష్టాలు రాకుండా చూసుకున్నాను. అయితే, నా మరణదినం గురించి తెలిసినప్పటి నుంచీ, నాకు అంతింతనరాని విచారం కలుగుతున్నది," అన్నాడు.



రాజు, అతణ్ణి, వదిలి ముందుకు సాగాడు. కొంతదూరం వెళ్ళాక, ఒక గ్రామం మధ్య గుంపుగా జనం చేరి వున్నారు. వాళ్ళ మధ్య. తలకు ముసుగు తగిలించుకున్న ఒక హాస్యగాడు, జనానికి ఏవో కథలు చెప్పి నవ్విస్తూ, తానూ నవ్వుతూ నృత్యం చేస్తున్నాడు.

వాడి నృత్యం పూర్తికాగానే, రాజు వాడి ముందు పడేలా ఒక బంగారు నాణెం విసిరివేసి, "నువ్వు నిత్యసంతోషిలా వున్నావు, అవునా ?" అని అడిగాడు.

ఆ ప్రశ్న వింటూనే హాస్యగాడు, తలకు తగిలించుకున్న ముసుగు ఊడదీశాడు. రాజుకు, వాడి చెంపల మీద ఎండిపోయిన కన్నీటిచారలు కనిపించినై.

హాస్యగాడు, రాజుతో, "అయ్యా, నాలుగు డబ్బులు సంపాయించేందుకు, నవ్వుతూ, నృత్యం చేస్తూ, జనానికి వినోదం కలిగిస్తాను. అలా చేయకపోతే, నా పిల్లలు ఆకటికి మాడవలసి వస్తుంది," అన్నాడు విచారంగా.

ఆ జవాబు విన్న రాజుకు మరింత విచారం కలిగింది. ఆయన తిరిగి బయలుదేరాడు. ఎన్నో రోజులు గడిచినా, ఆయనకు యింతవరకూ నిత్యసంతోషి అయిన మనిషి కనిపించలేదు.

ఒకనాడు ప్రయాణబడలికతో, ఆయన దారిపక్కన వున్న చెట్టుకు చేరగిలబడి కూర్చున్నాడు; క్రమంగా నిద్రపట్టింది.

కొంతసేపటికి ఆయనకు మెలకువ వచ్చింది. దానితోపాటు ఆకలి దహించసాగింది.

రాజు చుట్టూ ఒకసారి కలయచూసి, లేచి నిలబడ్డాడు. అంతలో ఆయనకు దాపుల ఎవరో చెట్టును నరుకుతున్న శబ్దం



వినిపించింది. గుర్రం కళ్ళెం పట్టుకుని నడిపిస్తూ, రాజు ఆ శబ్దం వచ్చినవైపుకు వెళ్ళాడు. అక్కడ ఒకచోట గొడ్డలితో కట్టెలు కొడుతూ, ఒక మనిషి కనిపించాడు.

వాడు, రాజును చూస్తూనే, ఉత్సాహంగా, ''అయ్యా, నమస్కారం! తమరీ ప్రాంతానికి, ఏం పనిపడి వచ్చారు?'' అని అడిగాడు.

అందుకు రాజు, తాను దారితప్పానన్నాడు. వెంటనే కట్టెలు కొట్టేవాడు, ''అలా అయితే, చాలా ఆకలి మీద వుండి వుంటారు. తమరు, నా అతిథులు, రండి!'' అని, రాజును తన గుడిసె దగ్గిరకు తీసుకుపోయాడు.

రాజు, అక్కడ కాళ్ళూ, చేతులూ కడుక్కునే లోపల, గుడిసెలోకి పోయి కట్టెలు కొట్టేవాడు నాలుగు రొట్టెలు తెచ్చి, ఆయన ముందుంచాడు.

రాజు, వాణ్ణి, ''నువ్విక్కడ ఒంటరిగా జీవిస్తున్నావా?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు వాడు నవ్వి, ''ఒంటరిగానా! ఈ ప్రాంతాన చక్కగా పాడేపక్షులూ, నాట్యం చేసే నెమళ్ళూ, కుందేళ్ళూ— ఇలా ఎన్నిరకాల పక్షులూ, జంతువులూ లేవు! అవన్నీ, నా మిత్రులే. పైగా అప్పుడప్పుడూ తమబోటి అతిథులు కూడా వస్తూ వుంటారు,'' అన్నాడు.

తర్వాత, రాజూ కట్టెలు కొట్టవాడూ మాటల్లోపడ్డారు. కొంతసేపయాక రాజుకు హఠాత్తుగా, తాను ఎల్లవేళలా సంతోషంగా వుండే మనిషిని చూశానన్న అభిప్రాయం కలిగింది.

''ఈ అరణ్యప్రాంతాన, నువ్వు చాలా ఆనందంగా కాలం గడుపుతున్నావనుకుంటాను!'' అన్నాడు రాజు.

''తమరన్న మాట నిజం! ఈ అరణ్యప్రాంతాన్ని ఎన్నటికీ వదిలివెళ్ళను,'' అన్నాడు కట్టెలు కొట్టేవాడు.

ఆ జవాబు వింటూనే రాజుకు, తాను ఎవరికోసమైతే వెతుకుతున్నాడో, ఆ మనిషి కనిపించాడన్న నమ్మకం కలిగింది.

ఆయన వాడితో, "నాకొక ఉంగరం యివ్వగలవా? అందుకు బదులుగా, నువ్వేమడిగినా యిస్తాను," అన్నాడు.

ఇది వింటూనే కట్టెలు కొట్టేవాడు పెద్దగా నవ్వి, "నేను తమకు ఉచితంగా యివ్వగలను. కాని, వచ్చిన చిక్కేమంటే, నా దగ్గిర ఉంగరమంటూ లేదు," అన్నాడు.

రాజు, వాడిచ్చిన అతిథ్యానికి కృతజ్ఞత చెప్పి, నగరానికి తిరిగి వచ్చాడు. మర్నాడు, ఆయన యోగి దగ్గిరకుపోయి, "మహాత్మా, ఎంతో శ్రమపడి, నేనొక నిత్య సంతోషిని చూశాను కాని, అతడి దగ్గిర ఉంగరం లేదు!" అని చెప్పాడు.

యోగి చిరునవ్వు నవ్వి, "రాజా, నువ్వనే, ఆ నిత్యసంతోషి దగ్గిర ఒక్క ఉంగరమైనాలేదు; అయినా, అతడు ఏ విచారం లేకుండా, సంతోషంగా వున్నాడు! ఇంత పెద్ద రాజ్యానికి అధిపతివైన నీకు, ఎల్లవేళలా విచారం ఎందుకు? అతడి సంతోషానికి కారణం ఏమిటి?" అని అడిగాడు.

రాజు కొంచెం సేపు ఆలోచించి, "బహుశా అతడికి, సంతోషానికి మూలకారణం ఏమిటో తెలిసివుంటుంది!" అన్నాడు.

అప్పుడు యోగి, రాజుతో, "ఆ కట్టెలు కొట్టేవాడు అంత సంతోషంగా వున్నాడంటే, అందుకు కారణం, అతడిలో ప్రబలమైన కోరికలు లేకపోవడం. మనిషిలో కోరికలు పెరుగుతున్నకొద్దీ, అతడిలో విచారం, అశాంతీ పెరుగుతూ పోతుంది. కారణం ఏమంటే—మన కోరికలన్నీ సఫలం అయే అవకాశం లేదు. మనిషి పేదరికాన్ని, అతడి సఫలం కాని కోరికలనుబట్టి లెక్కకట్టవచ్చు. అందు వల్ల, ఉన్నదానితో తృప్తిపడుతూ ప్రశాంతంగా జీవయాత్ర సాగించు," అని హితవు చెప్పాడు.

రాజు సోమశేఖరుడు, యోగికి నమస్కరించి, తన ప్రాసాదానికి తిరిగి వచ్చాడు. ఆ తర్వాత, క్రమంగా ఆయన మనసులో విచారానికీ, అశాంతికీ తావులేకుండా పోయింది.






విదేహదేశాన్ని పాలించే, విక్రమకీర్తి అనే మహారాజుకు, చిన్మయుడనే ఆంతరంగిక మిత్రుడుండేవాడు. చిన్మయుడికి, మహారాజుతో అంతటి సన్నిహితమైన స్నేహం వుండడం చూసి సహించలేని, రాజోద్యోగులు చాలామంది వుండేవాళ్ళు. వాళ్ళు, ఎలాగైనా, వాళ్ళిద్దరిమధ్యా విభేదాలు సృష్టించడానికి అవకాశం కోసం ఎదురు చూడసాగారు.

ఇలా వుండగా, ఒకనాడు వృద్ధురాలైన రాజమాత హఠాత్తుగా మరణించింది. దుఃఖంలో వున్న రాజు విక్రమకీర్తిని, నగరంలోని ప్రముఖులంతా వచ్చి పరామర్శించసాగారు. అయితే చిన్మయుడు మాత్రం రాజును పరామర్శించడం అలా వుంచి, ఆ చాయలకు కూడా రాలేదు. అందుకు కారణం, ఆ సమయంలో అతడు తనకు చాలా విశ్వాసపాత్రుడైన సేవకుడి ఇంట పెరిగిన, ఒక అనాథబాలిక వివాహానికి హాజరుకావడం.

రాజు, తన తల్లి అంత్యక్రియలు చాలా ఘనంగా జరిపించాడు. చిన్మయుడు, ఆ సమయంలో కూడా రాకపోవడం గమనించిన, అతడి విరోధులు రాజుతో, "మహారాజా, చిన్మయుడు ఎంత అమర్యాదగా, కృతఘ్నుడుగా ప్రవర్తించాడో చూశారా! దుఃఖంలో వున్న తమను పలకరించడానికి రాలేదు. రాజమాత అంత్యక్రియలక్కూడా హాజరుకాలేదు," అన్నారు.

'అవును! ఇందుకు కారణం ఏమై వుంటుంది?" అన్నాడు రాజు ఎంతో కోపంగా.

"అంత పెద్ద కారణం మరేం లేదు, మహారాజా! తన సేవకుడి ఇంట జరుగుతున్న వివాహం చూడబోయాడు. అతడికి రాజమాత మరణం కన్న, ఒక పేద

జొన్నలగడ్డ రత్న

ఇంటి పెళ్ళి ప్రాముఖ్యంగా కనబడింది. ఇందువల్లనే, అర్హత లేనివాళ్లను అందలం ఎక్కించకూడదంటారు, పెద్దలు!'' అన్నారు చిన్మయుడి విరోధులు.

అసలే దుఃఖంలో వున్న రాజుకు, యీ చెప్పుడుమాటలు బాగా చెవికెక్కాయి. ఆయన పట్టరాని కోపంతో భటులను పిలిచి, ''మీరు వెంటనే పోయి, ఆ పొగరుబోతు, కృతఘ్నుడు చిన్మయుణ్ణి పట్టి బంధించి కారాగారంలో వేయండి.'' అని అజ్ఞాపించాడు.




సేవకుడి ఇంట పెళ్ళి వేడుకలలో వున్న చిన్మయుణ్ణి, రాజభటులు వున్నపళంగా బంధించి, తీసుకుపోయి, కారాగారంలో వేశారు.

ఈ వార్త, విక్రమకీర్తి మంత్రి అయిన అమలశర్మకు తెలిసింది. ఆయన రాజు దగ్గిరకు వెళ్ళి, ''మహారాజా, చిన్మయుడు మర్యాదా, మన్ననా ఎరిగినవాడు. అతడు గొప్ప మేధావి అనీ, ఎన్నో సందర్భాలలో సముచితమైన సలహాలిచ్చి, రాజ్యక్షేమానికి కారకుడయ్యాడనీ, తమరు నాతో అని వున్నారు. అటువంటివాడు, తమను పరామర్శించడానికి కానీ, రాజమాత అంత్యక్రియలకుగానీ రాలేదంటే— అందుకు తగు కారణం ఏదో వుండి వుంటుంది. మనం స్వయంగా అతణ్ణి కలుసుకోవడం బావుంటుందని, నా సలహా,'' అని చెప్పాడు.

''కారణం తెలుస్తూనే వున్నదిగదా. అతడికి రాజునైన నాకన్న, సేవకుడు ముఖ్యం!'' అన్నాడు రాజు విసుగ్గా.

''క్షమించండి, మహారాజా! చిన్మయుణ్ణి మనం అపార్థం చేసుకున్నామని, నా అనుమానం,'' అన్నాడు అమలశర్మ నెమ్మదిగా.

రాజు ఒకటి, రెండు క్షణాలు ఆలోచించి, ''సరే, పదండి,'' అన్నాడు.

ఇద్దరూ కారాగారంలో వున్న చిన్మయుడి దగ్గిరకు వెళ్ళారు. రాజు, అతడికేసి తీవ్రంగా చూస్తూ, ''ఎంతోకాలంగా,

నిన్ను ఆప్తమిత్రుడనుకుని పొరబడ్డాను. తల్లిని పోగొట్టుకుని, నేను ఎంతో మనో వేదనలో వుండగా, కనీసం నన్ను పరామర్శించిపోవాలన్న జ్ఞానం కూడా, నీకు లేకపోయింది. ఆమె ఆత్మశాంతికి, ఎంతో ఘనంగా అంత్యక్రియలు జరిపించాను. దానికీ నువ్వు రాలేదు. వీటి అన్నిటికన్న, నీకు సేవకుడి ఇంటి పెళ్ళి, అతి ముఖ్యంగా కనబడింది. అవునా?'' అని ప్రశ్నించాడు.

ఇందుకు, చిన్మయుడు బాధగా, ''మహారాజా, నన్ను తమరు ఆప్తమిత్రుడనుకోవడంలో పొరబడలేదు! నా సేవకుడి ఇంట్లో జరిగిన పెళ్ళి విషయంలో, నేను ఎందుకు అంత శ్రద్ధ తీసుకోవలసి వచ్చిందో, మనవి చేస్తాను. సంతతి లేని, ఆ పేదవాడు, నా ప్రోత్సాహంతో, ఒక అనాథబాలికను పెంచి పెద్ద చేసి, తగిన వరుణ్ణి వెతికి పెళ్ళి చేశాడు. ఆ అనాథ బాలిక పెంపకం విషయంలో, నా బాధ్యతా కొంత వున్నది గనక, నేను ఆ పెళ్ళి వేడుకలు ముగిసేవరకూ, అక్కడ వుండి పోవలసి వచ్చింది. మనిషి మనస్సుకు దుఃఖమో, ఆనందమో కలిగించే విషయాలలో, రాజూ—సేవకుడూ అన్న తారతమ్యం లేదు. నేను, తమను దర్శించి, నా సానుభూతి తెలపాలనుకుంటూ, నా సేవకుడి ఇంటి నుంచి బయలుదేరబోతూండగా, భటులు నన్ను బంధించారు,'' అన్నాడు.

చిన్మయుడు ఇలా అనగానే, విక్రమకీర్తి తన తొందరపాటుకు సిగ్గుపడి, ''చిన్మయా, సంగతి సందర్భాలు తెలుసుకోకుండా, నీపట్ల కఠినంగా ప్రవర్తించాను. ఇందుకు ముఖ్య కారణం, నీవంటే విరోధభావం వున్న కొందరి చెప్పుడు మాటలు. పేదపెళ్ళి, గొప్ప అంత్యక్రియలు అంటూ, నన్ను అపమార్గం తొక్కించిన, ఆ అసూయాపరుల్ని, తగు విధంగా శిక్షించాలి!'' అంటూ స్వయంగా, అతడి సంకెళ్ళు తొలగించి, ఆప్యాయంగా కౌగిలించుకున్నాడు.






## 10

[చిత్రసేనుడూ, ఉగ్రాక్షుడూ తమ అనుచరులతో కపిలపురం కోటను వశపరుచుకుని, చీకటి కొట్లో బంధించబడి వున్న కపిలపురం రాజు వీరసింహుణ్ణి బంధవిముక్తుణ్ణి చేశారు. ద్రోహి నాగవర్మ ఎక్కడ? అని వీరసింహుడు తన కుమార్తె కాంతిమతిని ప్రశ్నించాడు. అతణ్ణి పట్టుకునేందుకు తన సేనానాయకుణ్ణి పంపినట్టు చిత్రసేనుడు ఆయనతో చెప్పాడు. తరవాత—]

చిత్రసేనుడి మాటలు వింటూనే వీరసింహుడు చాలా ఆశ్చర్యపడ్డాడు. అతడు ఉగ్రాక్షుడికేసి ఓమారు చూసి, చిత్రసేనుడికేసి తల తిప్పుతూ, ''ఈ ఉగ్రాక్షుడికీ నీకూ వున్న సంబంధం యజమాని సేవకుల మధ్య వుండే సంబంధం లాటిదని నేను వినలేదు. నాకు వచ్చిన వర్తమానం మరొకటి. అందువల్లనే, నాగవర్మ ద్రోహం చేయనున్నాడని ముందుగా తెలిసికూడా, పొరుగురాజువైన నీ సహాయం కోరలేకపోయాను,'' అన్నాడు.

''అవును మహారాజా! ఉగ్రాక్షుడు మాట్లాడే ధోరణి కొన్ని అపోహలకు కారణం అయింది. మీ కుమార్తె కూడా అలాంటి అపోహకే గురి అయింది,'' అన్నాడు చిత్రసేనుడు.

అతడి మాటలకు కాంతిమతి చిరునవ్వు నవ్వింది. ఉగ్రాక్షుడిలో ఏమాత్రం




చలనంలేదు. అతడు స్థాణువులా వీర సింహుడికేసి చూస్తూ అలాగే వుండి పోయాడు. వీరసింహుడు ఓ క్షణకాలం ఏదో ఆలోచిస్తున్నవాడిలా వూరుకుని, తరవాత ఉగ్రాక్షుడితో, ''చిత్రసేనుడు చెప్పినదాంట్లో అబద్ధం ఏమీ లేదుకదా, ఉగ్రాక్షా?'' అన్నాడు.

''చిత్రసేన మహారాజు చెప్పినదంతా నిజం. ఆయన వివాహం ఆడి, ఎప్పుడు మహారాణిని తెచ్చుకుంటాడా అని నేను ఎదురుచూస్తున్నాను,'' అన్నాడు ఉగ్రాక్షుడు.

వీరసింహుడు సిగ్గుతో తలవంచుకున్న తన కుమార్తెతో ఏమో అనబోయేంతలో ఇద్దరు సైనికులు రొప్పుతూ అక్కడికి పరిగెత్తుకు వచ్చి, ''మహారాజా! నాగవర్మ పెద్ద సైన్యంతో మన కోటను సమీపిస్తు న్నాడు,'' అని చెప్పారు.

నాగవర్మ పేరు వింటూనే వీరసింహుడు ఉలిక్కిపడ్డాడు. చిత్రసేనుడికి కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. అతడికి ఆ క్షణంలో అనేక అనుమానాలు కలిగినై. నాగవర్మ ధవళగిరిని జయించి తిరిగి యిక్కడికి వస్తున్నాడా? అలా కాక అక్కడ జరిగిన యుద్ధంలో ఓడిపోయి యిక్కడికి పారిపోయి రావటం జరిగితే, తను సైన్యాలతో పంపిన తన సేనానాయకుడు ఎక్కడ వున్నట్టు? ఏది ఏమైనా తను వెంటనే కోటరక్షణకు పూనుకోవటం అవసరం!

''ఉగ్రాక్షా! నువ్వు నీ సేవకులతో కోట ద్వారాలను కాపాడు. బురుజులమీద రక్షణకు కొంతమంది విలుకాళ్ళను వుంచటం మంచిది. అమరపాలు డెక్కడ?'' అన్నాడు చిత్రసేనుడు.

''ఆయన స్వయంగా శత్రుసైన్యాల బలం ఏపాటో చూసేందుకు అడవిలోకి వెళ్ళాడు,'' అని సైనికులు జవాబు చెప్పారు.

''ఉగ్రాక్షా, యిక నువ్వు నీ సేవకులతో కోట ద్వారాలను....'' అని చిత్రసేనుడు

చెప్పబోయేంతలో, ఉగ్రాక్షుడు బిగ్గరగా నవ్వి, "మహారాజా! ఇంక కోటకు ద్వారాలూ, బురుజులూ ఎక్కడ వున్నవి? ఇప్పుడు కోటగోడల్లో ఎక్కడ చూసినా ద్వారాలే. నా సేవకులు గునపాలతో గోడ అంతా కన్నాలు వేశారు. కొన్నిచోట్ల గోడను పునాదులతో కూడా ఎత్తివేశారు. ఇక బురుజులంటారా? అవన్నీ రాళ్ళూ రప్పలుగా కింద భూమిమీద చెల్లాచెదురై వున్నవి. మనం కోటను వశపరుచుకునేందుకు చేసిన బీభత్సం మీరు గమనించినట్టు లేదు," అన్నాడు.




"అలాగా," అంటూ చిత్రసేనుడు ఆశ్చర్యపోయాడు. "మనం చిక్కులో పడ్డాం. శత్రువులు మనను అన్ని వైపుల నుంచీ ఎదుర్కోవచ్చు. నాగవర్మ యింత త్వరలో ధవళగిరి వద్ద విజయం సంపాయించి యిక్కడికి తిరిగి వస్తాడని నేను వూహించలేదు," అన్నాడు.

అంతలో అమరపాలుడు అక్కడికి పరిగెత్తుకుని వస్తూ, "ఆ ద్రోహి విజయుడై యిక్కడికి రావటంలేదు మహారాజా, పారిపోయి వస్తున్నాడు. అతడి వెంట వున్న సైన్యం కూడా ఏమంత పెద్దది కాదు. ఆ సైన్యాన్ని వెన్నాడివస్తూ, దూరంగా కొండల్లో మరొక సైన్యం కనిపించింది. ఆ సైన్యం బహుశా మీ తండ్రిగారిది గానీ, లేక మీరు సహాయం పంపిన మనసేన గానీ అయివుంటుంది," అన్నాడు.

అమరపాలుడి మాటలు వింటూనే ఉగ్రాక్షుడు భవనం ప్రతిధ్వనించేలా నవ్వాడు. చిత్రసేనుడికి ఎక్కడ లేని ఆనందం కలిగింది. అతడు అమరపాలుడితో, "అమరపాలా, నువ్వు సైనికులందర్నీ ఒక చోట చేర్చి, నాకోసం వేచి వుండు. ఆ ద్రోహిని కోటముందు మైదానంలోనే సర్వనాశనం చేద్దాం," అన్నాడు.

"నాకొక మంచి యోచన కలిగింది, మహారాజా! మీరు అనుమతించితే చెపుతాను," అన్నాడు ఉగ్రాక్షుడు.



గ్రహించినప్పుడు, మనకు దొరక్కుండా మరెటువైపుకైనా పారిపోవచ్చు." అన్నాడు అమరపాలుడు.

"అదీ నిజమే!" అంటూ చిత్రసేనుడు ఓ క్షణకాలం ఆలోచిస్తూ వూరుకుని, తరవాత ఉగ్రాక్షుడికేసి తిరిగి, "ఒకసారి ఆ శత్రుసైనికుల్ని కోట ఆవరణలోకి ప్రవేశించనిస్తే, వాళ్ళలో కొందరైనా రాజ ప్రాసాదంలోకి జొరబడే ప్రమాదం కలగ వచ్చుగదా?" అని అడిగాడు.

"అలాంటి చిక్కు రాకుండా చూసే బాధ్యత నాది, మహారాజా! నా రాక్షస బంట్ల బలం మీకు సొంతం తెలీదు. ఆ నాగవర్మను ఎలాగైనా చేజిక్కించుకుని బలి పెడితే తప్ప లేకపోతే, ఈ ప్రాంతాలకు శాంతి వుండదు. వాడు మనకు దొరక్కుండా పారిపోయాడో, వాడు ఎప్పటికీ మనకు పక్కలో బల్లెమే!" అన్నాడు ఉగ్రాక్షుడు.

"బాగా చెప్పావు ఉగ్రాక్షా!" అంటూ వీరసింహుడు అతణ్ణి మెచ్చుకుని, చుట్టూ వున్న సైనికులతో, "మీలో ఎవరైనా సరే, ఆ ద్రోహి నాగవర్మను ప్రాణాలతో పట్టి నాకు ఒప్పచెపితే అర్ధరాజ్యం యిస్తాను. తల తెచ్చినవాడికి తక్షణమే వెయ్యి బంగారు కాసులు యిస్తాను." అన్నాడు ఉద్రేకంగా.

"త్వరగా చెప్పు, ఏమిటది?" అని ప్రశ్నించాడు చిత్రసేనుడు.

"నాగవర్మను తన అనుచరులతో కోటలోకి అడుగు పెట్టనివ్వటం మంచిది. ఆ తరవాత అతణ్ణి చుట్టుముట్టి, ఒక్కగా నొక్క శత్రువైనా పారిపోకుండా మట్టు పెట్టవచ్చు." అన్నాడు ఉగ్రాక్షుడు ఎంతో ఉత్సాహంగా.

"ఇది మంచి ఉపాయమే మహారాజా! వెనక నుంచి తనను సైన్యాలు తరుము తున్నవని ఆ ద్రోహికి తెలియంది కాదు. ఈ కోట తనకు రక్షణ యివ్వగలదని అతడు యిక్కడికి పారిపోయి వస్తున్నాడు. ఇది మన ఆధీనంలో వుందని అతడు

''అర్ధరాజ్యమా ?'' అంటూ రాజ కుమారి కాంతిమతి ఆశ్చర్యపోయి, తన తండ్రికేసి చూసింది.

''అవును, అర్ధరాజ్యమే! ఆ ద్రోహి నన్ను అసమర్థుణ్ణి చేసి యింతకాలంగా రాజ్యాన్ని అల్లకల్లోలపరచటమే గాక, నన్ను ఈ చీకటికొట్లో బంధించి నానా హింసలపాలూ చేశాడు.'' అన్నాడు వీర సింహుడు.

''అయితే, కోటలో పురుగు వున్నట్టు కూడా ఆ నాగవర్మకు తెలియకూడదు. సైనికులందర్నీ వారివారి స్థానాల్లో దాచి వుంచి, వాడు సైన్యంతో కోటలో ప్రవేశించ గానే ఒక్కుమ్మడిగా మీద పడి అందర్నీ యమపురికి ప్రయాణం కట్టించాలి.'' అన్నాడు చిత్రసేనుడు.

''అవును మహారాజా! ఆ పని నాకూ, అమరపాలుడికీ వదలండి. మీరూ, వీరసింహ మహారాజుగారూ, రాజకుమారీ భవనం మీద ఎక్కడైనా వుండి, మా ప్రతాపం తిలకించండి,'' అంటూ ఉగ్రాక్షుడు, తన సేవకులకేసి తిరిగి, ''ఒరే, బంట్లూ, ఎక్కడ ?'' అని హుంకరించాడు.

అమరపాలుడీ, ఉగ్రాక్షుడీ నాయకత్వంలో సైనికులూ, రాక్షసులూ కోట లోపలి భవనాల వెనకా, చెట్లచాటునా




దాగివుండే ప్రయత్నాలు చేస్తూండగా, కోట సమీపంలోని అడవిని చేరిన నాగవర్మ, గుర్రం మీద లేచి నిలబడి కోట బురుజుల కేసి చూస్తూ, ''కరవీరా! మనం ఊహించిందే నిజమయింది. శత్రువులు కోట మీద పడి నానా బీభత్సం చేసి ఎటో వెళ్ళి పోయారు,'' అంటున్నాడు.

ఈ కరవీరు డనేవాడు జ్వాలాద్వీపం నుంచి వచ్చిన పులిరాయుళ్ళ నాయకుడు. నాగవర్మ వెంట కొందరు అనుచరులతో ధవళగిరి మీదికి దాడి వెళ్ళి, అక్కడ చిత్రసేనుడి తండ్రి అయిన తారకేశ్వర మహారాజువల్ల చావుదెబ్బలు తిని, కపిల పురం కోటకు పారిపోయివస్తున్నాడు.

శత్రువులకు చిక్కాడేమో అని. అలా జరిగితే మనకు ముందుముందు ప్రమాదం కూడా. ఏది ఏమైనా మనం కోటలో ప్రవేశించి తారకేశ్వరుడి సైన్యాలు వచ్చేలోపల రక్షణలను బలపరుచుకోవటం క్షేమం. కోట గోడల్ని రక్షణగా పెట్టుకుని మనం శత్రువులను ఎంతకాలం అయినా ఎదిరించి నిలబడవచ్చు.'' అన్నాడు నాగవర్మ.

ఆ తరవాత నాగవర్మా, కరవీరుడూ తమ తమ అనుచరులకు హెచ్చరికలు చేశారు. ''మనను వెనకనుంచి శత్రువులు తరుముకు వస్తున్నారు. అసంఖ్యాకులైన వాళ్ళ చేతుల్లో పడి చావకుండా తప్పించుకోవాలంటే, మనకు కపిలపురం కోట ఒక్కటే రక్షణ యివ్వగలదు. ఊం, కదలండి!'' అంటూ నాగవర్మ కేకలు పెట్టాడు.

నాగవర్మా, కరవీరుడూ గుర్రాలమీద ముందు బయలుదేరారు. వారికి వెనకగా కాల్భటులూ, వాళ్ళ వెనక మరికొందరు గుర్రపు రౌతులూ కదిలారు. ఓ పావుగంట గడిచేసరికి అందరూ కోటగోడల ముందున్న మైదానం చేరారు. నాగవర్మా, కరవీరుడూ సైన్యాలను ఆగమని హెచ్చరించి, కూలిపోయిన కోట ముఖద్వారాల దగ్గిరకు వెళ్ళి లోపలికి తొంగిచూశారు. లోపల



''అవును, మహారాజా! మీరు చెప్పింది నిజం. శత్రువులు కోటలో వున్న మన భటులను ఓడించి, దాన్ని ఆక్రమించుకున్నట్టు తెలుస్తూనే వున్నది. కాని, ఇప్పుడు ఎక్కడా ఒక్క శత్రుసైనికుడైనా వున్నట్టు లేదు. కోటలో వున్నదంతా దోచుకుని వాళ్ళు తిరిగి చిత్రసేనుడి రాజధానికి వెళ్ళివుంటారు. నాకు కలిగే ఆశ్చర్యం అల్లా, నా అనుచరులూ, ఆ రెండు భయంకర పక్షులూ ఏమయాయని!'' అన్నాడు కరవీరుడు.

''నేను పడే ఆశ్చర్యం అదికాదు; కోటలోని చీకటి గదిలో బంధించబడిన ముసలి రాజు వీరసింహుడు ప్రాణాలతో

అంతా నిశ్శబ్దం, చీమ చిటుక్కుమన్నా వినబడేంత నిశ్శబ్దం.

"ఇందులో ఏమయినా మోసం లేదు గదా?" అన్నాడు నాగవర్మ కాస్త అనుమానంగా.

"మోసం ఏముంటుంది? కోటలో వున్న నగా నట్రా దోచుకుని శత్రువులు వాళ్ళదారిన వాళ్ళు వెళ్ళారు. వాళ్ళకు కావలసిన ముసలిరాజు వీరసింహుడు కూడా వాళ్ళకు దొరికి వుంటాడు," అన్నాడు కరవీరుడు.

"మన సైనికుల్లో కొందరైనా యుద్ధంలో చచ్చివుంటారు గదా? కాని ఒక్కడి శవం కూడా కనిపించటం లేదు. శవాలు కూడా ఎలా మాయమయినై? ఉగ్రాక్షుడు తన రాక్షస బంట్లను తేలేదుగదా?" అన్నాడు నాగవర్మ.

నాగవర్మ ఇలా అనేసరికి పులిరాయుళ్ళ నాయకుడు కరవీరుడికి గుండె బలం జారింది. వాడికి ఉగ్రాక్షుడి రాక్షసులంటే ఎక్కడ లేని భయం.

"మహారాజా, ఎందుకైనా మంచిది, ఒక పని చేద్దాం," అన్నాడు వాడు, గుర్రాన్ని ముందుకు నడిపి, రహస్యం చెప్పేవాడిలా నాగవర్మకేసి మెడవంచి.

"ఏమిటదీ?" అని అడిగాడు నాగవర్మ.

"కోట ఇంత నిర్జనంగా, నిశ్శబ్దంగా వుండటం నాకు ఆశ్చర్యమే కాక అనుమానం కూడా కలిగిస్తున్నది. ఆ రాక్షసులూ, వాళ్ళ నాయకుడూ మనకోసం ఏదైనా మాటు వేశారేమోనని నా భయం. అట్లని మనకు రక్షణ యిచ్చే ఈ కోటను ఆక్రమించుకోకుండా వదిలిపోవటం ప్రమాదకరం. మనను వెన్నంటి వచ్చే తారకేశ్వరుడి సైన్యాలు మనను ఈ అడవిలో మృగాలను వేటాడినట్టు వేటాడగలవు. కనుక, మనం కోటలో ముందు ప్రవేశించకుండా, మన సైనికులను ముందు ప్రవేశపెట్టి, ఏమి జరుగుతుందో చూసి, ప్రమాదం లేకపోతే, వెనగ్గా మనం కోటలో జొరబడవచ్చు," అన్నాడు కరవీరుడు.

—(ఇంకావుంది)






# ముగ్గురువర్తకులకథ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఈ అర్ధరాత్రివేళ, అతి భయావహమైన ఈ శ్మశానంలో నువ్వు పడుతున్న శ్రమ చూస్తూంటే, నా కొక అనుమానం కలుగుతున్నది. నువ్వు సాధించనున్న మహత్కార్యంలో, పాలుపంచుకునేందుకు, ఎవరో ఒక మిత్రుడుండివుండాలి. అలా కానప్పుడు, నువ్వు ఒంటరిగా ఇన్ని కష్టాలను సహించడం సాధ్యపడదు. అయితే, కార్యసాధన తర్వాత, నువ్వు నీ మిత్రుడి కిచ్చిన మాట నిలుపుకోగలవా ? మనిషిబుద్ధి చంచలం అన్నది, కాదనరాని సత్యం. ఇందుకు ఉదాహరణగా, ముగ్గురు వర్తకులకథ చెబుతాను, శ్రమ తెలియ

## బేతాళ కథలు



కుండా, విను.'' అంటూ ఇలా చెప్ప సాగాడు:

అతి ప్రాచీనమైన ప్రతిష్ఠానపురంలో, జయేంద్రుడు, సోమేంద్రుడు, శివదాసు అనే ముగ్గురు వర్తకులుండేవారు. వాళ్ళు ముగ్గురూ దాదాపు సమవయస్కులు. ఒకరినొకరు బావా అని పిలుచుకునేవాళ్లు. వర్తకపనుల మీద పరాయి ప్రాంతాలకు వెళ్ళవలసి వచ్చినప్పుడు, ముగ్గురూ కలిసి వెళుతూండేవాళ్ళు.

ఒకసారి వాళ్లు, ఎంతో ప్రసిద్ధి చెందిన ప్రతిష్ఠానపురపు వజ్రపుగనులలో దొరికిన వజ్రాలను కొని, సింహపురం అనే నగరానికి బయలుదేరారు. అయితే, రెండు నెలల తర్వాత శివదాసు లేకుండా, జయేంద్రుడూ, సోమేంద్రుడూ మాత్రమే ప్రతిష్ఠానపురానికి తిరిగివచ్చారు.

వాళ్ళు దీనవదనాలతో శివదాసు ఇంటికి పోయి, అతడి భార్యతో, తాము తిరుగు ప్రయాణంలో, ఒక రాత్రివేళ, ఒకానొక అడవిలో విశ్రమించవలసి వచ్చిందనీ, ఆ సమయంలో పులి ఒకటి, శివదాసును నోట కరుచుకుని పారిపోయిందనీ చెప్పారు. అంతేకాక, శివదాసు సింహపురంలోని ఒక వర్తకుడికి, తన దగ్గిర వున్న వజ్రాలను సుమత్రా, బాలీద్వీపాలలో మంచి వెలకు అమ్మేందుకు అప్పగాయిచ్చాడనీ, అతడి నుంచి ధనం వసూలుకు, మరసటి సంవత్సరం రాగలనని చెప్పాడనీ తెలియబరిచారు.

శివదాసుకు ఇంకా యుక్తవయసు రాని ముగ్గురు పిల్లలున్నారు. భర్త దుర్మరణ వార్త విని అతడి భార్య దుఃఖించ సాగింది. జయేంద్రుడూ, సోమేంద్రుడూ ఆమెకు ధైర్యం చెబుతూ, ''అమ్మా, దుఃఖపడి ప్రయోజనం లేదు. నీ భర్త నుంచి వజ్రాలు తీసుకున్న వర్తకుడు, కొద్ది కాలంలో తాను వెళ్ళిన ద్వీపాల నుంచి తిరిగి వస్తాడు. అప్పుడు మేమతణ్ణి కలుసుకుని, నీ భర్తకు అతడివ్వవలసిన ధనం వసూలు చేసి తేగలం,'' అన్నారు.



జయేంద్రుడికి మగసంతానం లేదు; ఒకే ఒక కుమార్తె. సోమేంద్రుడికి ప్రణభుడు అనే ఇరవైయేళ్ళ వయసు కొడుకున్నాడు. వాడు తండ్రి దగ్గిర వ్యాపార మెలుకువలు నేర్చుకుంటున్నాడు.

రోజులు గడుస్తున్నవి. తన తండ్రి సోమేంద్రుడి ఆరోగ్యం క్రమంగా క్షీణిస్తున్నట్టు గ్రహించిన ప్రణభుడు, ఆయనకు వ్యాపారబాధ్యతలు తగ్గించి, తనే ఎక్కువభారం వహించసాగాడు.

మరి కొంతకాలం గడిచేసరికి, సోమేంద్రుడు పూర్తిగా అనారోగ్యం పాలై, మంచం పట్టాడు.

ఒకనాడు సోమేంద్రుడు, కొడుకును దగ్గిరకు పిలిచి, మాటపెగలక అయాస పడుతూ, "బాబూ, నాకు కాలం సమీపించింది!" అని, తెరలు, తెరలుగా వచ్చే దగ్గుతో మెలికలు తిరిగిపోతూ, "జయేంద్రుడు మనకు సగం యివ్వాలి...." అంటూ కొంతసేపు మైకంతో కళ్ళు మూసుకుని, తర్వాత కళ్ళు తెరిచి పెద్దగా అయాసపడుతూ, అతి హీనస్వరంతో ప్రణభుడికి మరి కొన్ని మాటలు చెప్పి, శాశ్వతంగా కళ్ళు మూశాడు.

ఆఖరుసారిగా తండ్రి చెప్పిన మాటల ద్వారా, ప్రణభుడికి అర్థమైనదేమంటే, జయేంద్రుడిచ్చే ధనాన్ని, శివదాసు భార్యకు అందచెయ్యమని! తప్పక అలా చేస్తానని ప్రణభుడు వాగ్దానం చేశాడు.

అతడు, తండ్రికి ఎంతో భక్తిశ్రద్ధలతో, శాస్త్రవిధిగా అంత్యక్రియలు జరిపాడు. తర్వాత ఒకనాడు, జయేంద్రుణ్ణి కలుసుకుని, "మామయ్యా, మా నాన్నకు నువ్వు చెల్లించవలసిన బాకీ ఏమైనా వున్నదా? ఈ మాట ఎందుకడుగుతున్నానంటే— ఆయన చనిపోయేముందు, నువ్విచ్చే ధనాన్ని శివదాసు మామయ్య భార్య నాగమణికి అప్పగించవలసిందిగా, నన్నాదేశించాడు," అని చెప్పాడు.

ఇందుకు జయేంద్రుడు విసుక్కుంటూ, "మీ నాన్నకు, నేను చెల్లించవలసిన



''అలా అని చెప్పలేను, మామయ్యా. ప్రాణం పోయేముందు, నాన్న ఎంతో ఆయాసపడుతూ, అతి చిన్న స్వరంతో మాట్లాడాడు. బహుశా నేను, ఆయన చెప్పినదాన్ని పొరబాటుగా అర్థం చేసుకుని వుంటాను,'' అన్నాడు ప్రణభుడు.

ఈ విషయాన్ని గురించిన చర్చ, అక్కడితో ఆగిపోయింది. ప్రణభుడు, శివదాసు కుటుంబానికి ఉన్నంతలో సాయం చేస్తూండేవాడు.

ఆరునెలలు గడిచినై. జయేంద్రుడు వ్యాపారనిమిత్తం సింహపురానికి బయలు దేరాడు. ప్రణభుడు తన తండ్రి లాగే, అతడి వెంట ప్రయాణమయ్యాడు. ఇద్దరి దగ్గిరా విలువైన వజ్రాలున్నవి.

ఈ ప్రయాణంలో, వాళ్ళొక అరణ్య ప్రాంతం చేరారు. రాత్రికి ఒక సాధువు వాళ్ళకు తన ఆశ్రమంలో ఆతిథ్యం యిచ్చాడు. సాధువూ, ఆయన శిష్యులూ, అంటురోగాలతో బాధపడుతున్న గూడెం ప్రజలకు, తమ చేతనైనసాయం చేస్తు న్నారు. జయేంద్రుడూ, ప్రణభుడూ, రోగ పీడితులకు సాయపడేందుకు కొంత ధనాన్ని సాధువుకు యిచ్చారు.

తర్వాత వాళ్ళు, అక్కడ వున్న నదిలో పడవప్రయాణం చేసి, సింహపురం చేరి, ఒక సత్రంలో బసచేశారు.

బాకీ అంటూ ఏమీ లేదు. పోతే, మా ప్రయాణాల్లో, సత్రాల్లోనూ, పడవ వాళ్ళకూ, మీ నాన్న అప్పుడప్పుడూ, మా యిద్దరి తరఫునా డబ్బు యిస్తూండేవాడు. కొన్ని సందర్భాలలో నేను, ఆ పని చేస్తూండే వాణ్ణి. ఇదంతా చిల్లరనాణేలతో తీరిపోయే ఖర్చు. ఒకవేళ అలాంటి చిల్లరామల్లరా గుణించి, మీ నాన్న నేనేదో బాకీ వున్నా ననుకున్నాడేమో! అలాంటి దేమైనా వున్నా—శివదాసు భార్యకు, అలాంటి చిల్లరడబ్బులు యివ్వడం మర్యాద అని పించుకోదు.'' అని ఆగి, ''ఇంతకూ, మీ నాన్న చెప్పింది, నీవు స్పష్టంగా విన్నావా?'' అని అడిగాడు.



మర్నాడు వాళ్ళిద్దరూ వజ్రాలు అమ్మేందుకు, నగరంలో చెరి ఒక వైపుకూ వెళ్ళారు. సింహపురానికి పొరుగు రాజ్యమైన మహేంద్రపురాన్ని పాలించే రాజుకు, నగరంలో ఒక భవనం వున్నది. ప్రణభుడు, ఆ రాజు దగ్గిరకు పోయి, తాను తెచ్చిన వజ్రాలను ఆయనకు చూపించాడు.

రాజు, ప్రణభుడు ఏ నగరంవాడో అడిగి తెలుసుకుని, ఆశ్చర్యపోతూ, ''గత సంవత్సరంలో కూడా, నేనీ నగరంలో వున్న సమయంలో ప్రతిష్ఠానపురాన్నుంచి ఒక వజ్రాల వర్తకుడు వచ్చాడు. అతడి దగ్గిర చాలా గొప్ప వజ్రం ఒకటి వున్నది. అలాంటి వజ్రాన్ని అంతవరకూ, నేను చూడలేదు. పెద్ద ధర యిచ్చి దాన్ని కొన్నాను,'' అన్నాడు.

ప్రణభుడు, ఆయనకు కొన్ని వజ్రాలు అమ్మి సత్రానికి తిరిగి వచ్చాడు. జయేంద్రుడు కొద్దిసేపు తరవాత తిరిగి రాగానే, ప్రణభుడు అతణ్ణి, ''మామయ్యా, గత సంవత్సరం మహేంద్రపురం రాజుకు, నువ్వేదైనా వజ్రాన్ని అమ్మావా?'' అని అడిగాడు.

''అమ్మలేదు. అసలెందుకు, యిలా అడుగుతున్నావు?''అన్నాడుజయేంద్రుడు.

''ఆయనకు కొన్ని వజ్రాలమ్మాను. చాలా మంచివాడు,'' అన్నాడు ప్రణభుడు.

మర్నాడు ప్రణభుడు, జయేంద్రుడితో, ''శివదాసు మామయ్య, ఇక్కడ ఒక వర్తకుడికి అమ్మమని కొన్ని వజ్రాలు యిచ్చాడు గదా. ఆయన సుమత్రా, బాలీద్వీపాల నుంచి తిరిగి వచ్చాడేమో కనుక్కుందాం. మామయ్యకు ఆయన ఇవ్వవలసిన ధనం వసూలు చేయడం అవసరం గదా,'' అన్నాడు.

అందుకు జయేంద్రుడు, ''ఆయన్ని గురించి వాకబు చేశాను. ఆ ద్వీపాల్లో, ఆయన బాగా నష్టపోయాడని చెబుతున్నారు. బహుశా, తిరిగి రాకనే పోవచ్చు. శివదాసు ఆయనను నమ్మి వజ్రాలు యివ్వవలసింది కాదు,'' అని జవాబిచ్చాడు.



పది రోజుల తర్వాత, ఇద్దరూ తిరుగు ప్రయాణమై, అరణ్యంలోని సాధువు ఆశ్రమాన్ని చేరారు.

మర్నాడు జయేంద్రుడు, ప్రణభుడితో, ''ఈ ప్రాంతాల శిథిలావస్థలో వున్న దేవాలయం, ఒకటున్నది. లోగడ వచ్చినప్పుడు మొక్కుకున్నాను. ఆ మొక్కుబడి చెల్లించాలి. అందుకు ఒంటరిగా పాదచారినై పోవలసి వున్నది,'' అని చెప్పి బయలుదేరాడు.

ప్రణభుడికి, ఈ మొక్కుబడి విషయం కొంత ఆశ్చర్యం కలిగించింది. అతడు రహస్యంగా జయేంద్రుణ్ణి అనుసరించాడు.

జయేంద్రుడు ఒక రాళ్ళమిట్ట దగ్గరకు పోయి, అక్కడ ఒక గుంటకు అడ్డుగా వున్న రాతిని పక్కకు లాగుతూనే, పెద్దగా అరిచి కిందపడిపోయాడు. వెంటనే పెద్ద సర్పం ఒకటి, పడగవిప్పి బుసలుకొడుతూ, దాపులనున్న రాళ్ళ చాటుకు వెళ్ళిపోయింది.

జయేంద్రుడు బాధతో గిలగిల కొట్టుకుంటూ, ''దాహం! దాహం!'' అని కేక పెట్టాడు. ప్రణభుడు అక్కడ రాళ్ళ మధ్య వున్న చెలమలోంచి, ఆకుదొప్పలో నీరు తీసుకునిపోయి, అతడికిచ్చాడు.

జయేంద్రుడు నీరు తాగాడు. అతడి కళ్ళు మూతలుపడిపోతున్నవి. గొంతు పెగలటం లేదు. ఆ స్థితిలోనే అతడు, ప్రణభుడితో, ''బాబూ, ఈ మహాపాపి చావబోతున్నాడు. ఆ గుంటలో ధనం వున్నది. దానిని తీసుకో!'' అని ఆయాసపడుతూ కొంచెం ఆగి, ''నా బాధల్లా, పెళ్ళీడు కొచ్చిన, నా కూతురు గురించి.... ఈ ధనం! ధనం!'' అని, ఆ పైన యిక మాట్లాడలేకపోయాడు.

ప్రణభుడు, జయేంద్రుడి రెండు చేతులూ గట్టిగా పట్టుకుని, ''మామయ్యా! నువ్వేం బెంగపడకు. నీ కుమార్తెను తగినవాడి కిచ్చి, వివాహం జరిపించగలనని వాగ్దానం చేస్తున్నాను,'' అన్నాడు.



ఆ మాటలు విన్న జయేంద్రుడి ముఖంలో, ఒక క్షణకాలం సంతోషం కనిపించింది. ఆ మరుక్షణాన అతడు మరణించాడు.

ప్రణభుడు ఆశ్రమానికి తిరిగి వచ్చి, సాధువుకు జయేంద్రుడి దుర్మరణం గురించి చెప్పాడు. సాధువు తన శిష్యుల చేత, అతడి కప్పటికప్పుడు అంత్యక్రియలు జరిపించాడు.

ప్రణభుడు, సాధువుకు రాళ్ళమిట్ట వద్ద వున్న ధనం సంగతి చెప్పి, "స్వామీ, దాన్ని తమకు తోచిన విధంగా ధర్మ కార్యాలకు వినియోగించండి," అని కోరాడు.

తర్వాత అతడు, జయేంద్రుడి ధనం, యితర వస్తువులతో, ప్రతిష్ఠానపురానికి తిరిగివచ్చి, వాటిని అతడి కుటుంబానికి అప్పగించాడు. శివదాసు భార్యకు, తను వర్తకంలో గడించిన లాభంలో సగం యిచ్చి, జరిగినది వివరించాడు.

కొన్నాళ్ళు ఆగి, ప్రణభుడు ఒక బంధువు ద్వారా, జయేంద్రుడి భార్యకు— తాను, ఆమె కుమార్తెను వివాహం ఆడేందుకు యిష్టపడుతున్నట్టు చెప్పించాడు. ఇది విని జయేంద్రుడి భార్య పరమానందం చెందింది.

ఒక సంవత్సరం తర్వాత, జయేంద్రుడి కుమార్తెతో, ప్రణభుడి వివాహం జరిగిపోయింది. అతడు తన వ్యాపారాన్ని కొనసాగిస్తూ, ఎంతో ధనం గడించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ప్రణభుడి ప్రవర్తన శంకించదగినదిగా లేదా? జయేంద్రుడు పాతిపెట్టిన ధనాన్ని, ప్రణభుడు అతడి కుటుంబానికి ఎందుకివ్వలేదు? తాను వ్యాపారంలో సంపాయించిన ధనంలో, సగం శివదాసు భార్యకు ఎందుకిచ్చాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "శివదాసు ఒక వర్తకుడి ద్వారా, తన వజ్రాలను సుమత్రా, బాలీద్వీపాలకు పంపాడన్నది

కట్టుకథ అని ప్రణభుడు గ్రహించాడు. శివదాసు తన వజ్రాలను మహేంద్రపురం రాజుకూ, మరి కొందరికీ అమ్మినట్టు, తగిన సాక్ష్యాధారం కనబడుతున్నది. కాని ఒకటి—శివదాసు తిరుగుప్రయాణంలో ఎలా మరణించాడో తెలుసుకోవడం సాధ్యపడదు. అయితే, రాళ్ళమిట్ట వద్ద పాతిపెట్టబడిన ధనం, శివదాసుదై వుండవచ్చు! బహుశా, జయేంద్రుడూ, సోమేంద్రుడూ, శివదాసు ధనాన్ని కూడా వెంట తీసుకుపోవడం ప్రమాదకారణం కావచ్చని భావించి వుంటారు. తమ ఇద్దరి ధనం, దారిదోపిడి దొంగల వాతబడినా, పాతిపెట్టిన ధనం తమకు దక్కుతుందని, వాళ్ళు ఆశించి వుంటారు. ఆ ధనాన్ని తర్వాత పంచుకోవచ్చన్నది, వాళ్ళ పథకం అయి వుంటుంది. జరిగిన ఘోరకార్యంలో, తను భాగస్వామి అయినందుకు, సోమేంద్రుడు పశ్చాత్తాపం చెందాడు. అందువల్లనే, ఆ దాచిన ధనంలో తనవంతు, శివదాసు భార్యకివ్వమని, అతడు కొడుకును ఆదేశించాడు. ఈ జరిగినదంతా అర్థం చేసుకున్న ప్రణభుడు. న్యాయవర్తనుడూ, వివేకీ అయినవాడు ఎలా ప్రవర్తిస్తాడో, అలా ప్రవర్తించాడు. అతడు పాతిపెట్టిన ధనాన్ని అంటకపోవడానికి కారణం—అది న్యాయార్జితమో, అన్యాయార్జితమో, స్పష్టంగా తెలియకపోవడం. అందుకే దాన్ని, పరోపకారి అయిన సాధువుపరం చేశాడు. అదే సమయంలో, తన తండ్రి కోరిన విధంగా, శివదాసు భార్యకు, తన ధనంలో భాగం యిచ్చాడు. మరణ సమయంలో జయేంద్రుడికిచ్చిన వాగ్దానాన్ని నిలుపుకునేందుకు, అతడు ఆయన కుమార్తెను వివాహం ఆడాడు. ఇదంతా తరచిచూస్తే—ప్రణభుడు అసామాన్యమైన నీతిమంతుడూ, ధర్మగుణం గల యువకుడని తెలుస్తుంది,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



మనదేశపు అద్భుతాలు:

# గోల్కొండ కోట




ఈనాటి ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాదు ఒకప్పుడు గోల్కొండ రాజ్యం రాజధానిగానూ, 1947వ సంవత్సరం వరకు నిజాంరాష్ట్ర రాజధానిగానూ ఉండేది. హైదరాబాదు నగరానికి పది కిలోమీటర్లు పశ్చిమదిశలో నల్లరాళ్ళ కొండ మీద గోల్కొండకోట వెలుగొందుతున్నది. ఈ కోట చుట్టుకొలత 11 కిలోమీటర్లు.




సుల్తాన్ ఖులీ కుతుబ్ షా అనే తురుష్క నవాబు, 1518వ సంవత్సరంలో ఈ స్థలాన్ని చూసి అక్కడ తన రాజధానిని నిర్మించాలని పూనుకున్నాడు. క్రమక్రమంగా కోట నిర్మాణం ప్రారంభమయింది. ఈ కోట మంచి పరిపాలన సాగించిన సుల్తానులను కుతుబ్ సాహీలు అనే వారు.

ఈ కోట ఎన్నెన్నో ప్రత్యేకతలను సంతరించుకున్నది. ప్రవేశ ద్వారం వద్ద చేతులు తట్టినట్టయితే, ఆ చప్పుడు 61 మీటర్ల ఎత్తయిన కోట బురుజు మీదికి వినిపిస్తుంది. గోడలపై అతి సున్నితమైన సృటికాలను పొదగడం వల్ల ఇది సాధ్యమవుతున్నదని భావిస్తున్నారు.





కోట చుట్టూ ఉండే ప్రహరీ గోడకు ఎనిమిది ద్వారాలూ, డెబ్భైబురుజులూ ఉన్నవి. శత్రుసేనలు జొరబడడానికి వీలుకాకుండా ఎంతో పకడ్బందీగా ఈ ప్రహరీ గోడ నిర్మించబడింది.

కోట బురుజులు చాలా దూరం వరకు కనిపిస్తాయి. పాలకులు నివసించిన కొండ మీది ఈ అద్భుత భవనాన్ని చేరుకోవాలంటే చిక్కయిన మార్గాల గుండా వెళ్ళాలి.






కోట సమీపంలో కుతుబ్ షా పాలకుల మసీదులు కొన్ని ఉన్నాయి. ఇవి, మొనదేలిన ద్వార గోపురాలతో పర్యవేక్షింపబడి, చతురస్రమైన ఆధార పీఠంతో ఉన్నవి. ఇక్కడ మహమ్మదీయ శిల్ప సంప్రదాయంతోపాటు హైందవ చిహ్నాలయిన తామరపూవులూ, తామరాకులూ చోటు చేసుకోవడం గమనించతగ్గ విశేషం.

గోల్కొండ రాజ్యం 1687వ సంవత్సరం వరకు స్వతంత్ర రాజ్యంగా వెలుగొందింది. ఆ సమయంలోనే పెద్ద సైన్యంతో, దురాక్రమణ చేయాలన్న ఆత్యాశతో ఔరంగజేబు అక్కడికి వచ్చాడు.





ఔరంగజేబు గోల్కొండ కోటను ముట్టడించాడు. ఇరు సేనల మధ్య భయంకర యుద్ధం జరిగింది. సుల్తానుల సైన్యం ఓడిపోయింది. ఔరంగజేబు, గోల్కొండ కోటను మొగలు సామ్రాజ్యంతో కలుపుకున్నాడు.

గోల్కొండ కోట వైభవోపేతమైన రోజులు గతించాయి. మొగలు సామ్రాజ్యమే క్షీణదశకు రావడంతో మొగలులు సైతం ఈ కోట పరిరక్షణపట్ల ఆసక్తి చూపలేదు. అయినా, గోల్కొండ కోటలో వజ్రాలు సానబట్టడం మొదలు కావడంతో అది మళ్ళీ ప్రాముఖ్యతను సంతరించుకున్నది.






గోల్కొండ వజ్రపు గనుల నుంచి ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన వజ్రాలెన్నో వచ్చాయి. 'మహా మొగల్' వజ్రం 1650వ సంవత్సరం లభించింది. దానిని ఔరంగజేబు పట్టుకుపోయాడు. లండన్ నగరంలో మహారాణి ఆస్తిగా ఉంటూన్న కోహినూర్ వజ్రం కూడా గోల్కొండ ప్రసాదించిన అమూల్యమైన కానుకే!



# కోడలికోసం పరీక్ష

విదర్భరాజు విజయసేనుడు, మంచి ధర్మపాలకుడుగా పేరు పొందాడు. ఆయన రాజ్యంలోని ప్రతి పౌరుడూ, ఎలాంటి ఒడిదుడుకులు లేకుండా సుఖశాంతులతో జీవిస్తున్నారని, పొరుగురాజ్యాలలో కూడా చెప్పుకునేవారు.

విజయసేనుడికి ఒకే ఒక కుమారుడు; అతడి పేరు సుకేతుడు. అతడిలో వుండవలసిన రాజలక్షణాలన్నీ వున్నా, మేధావితనం మాత్రం కొరవడింది. రాజుకు ఇది చాలా విచారకారణంగా వుండేది.

ఒకనాడు రాజు, ఈ విషయం గురించి మంత్రులతో సంప్రతించాడు. వాళ్ళు ఏకగ్రీవంగా, ఆయనకు, ''ప్రభూ, యువరాజుకు వివాహ యోగ్యమైన వయసు వచ్చిందిగదా. ఆయనకు మంచి తెలివితేటలూ, సమయస్ఫూర్తీ వున్న కన్యనిచ్చి వివాహం చేస్తే, ఈ సమస్య శాశ్వతంగా పరిష్కారమైపోయినట్టే.'' అని సలహా యిచ్చారు.

విజయసేనుడికి మంత్రుల సలహా నచ్చింది. ఆయన కొందరు వేగులను, అలాంటి కన్య ఎక్కడున్నదీ తెలుసుకునేందుకు పంపాడు. కొన్నిరోజుల తర్వాత ఆయనకు, వాళ్ళ నుంచి ఒక రహస్య సమాచారం అందింది. వెంటనే కాశీ యాత్రికుడిలా మారువేషం వేసుకుని, ఆయన, ఆ కన్య వున్న గ్రామానికి బయలుదేరాడు.

రాజు ఆ గ్రామం చేరేసరికి బాగా చీకటిపడింది. సుమతి అనే పేరు గల ఆ కన్య తండ్రి గ్రామాధికారి. ఆయన ఏదో పనిపడి పట్నం వెళ్ళాడు. సుమతి, రాజుకు అతిథ్యం యిచ్చింది.

రాత్రి భోజన సమయంలో, రాజు విజయసేనుడు తన వజ్రపుటుంగరాన్ని

ఎం. డి. సౌజన్య



కుడిచేతి వేలి నుంచి, ఎడమచేతి వేలుకు మార్చుకుంటూ, సుమతితో, "కుడి ఎడమైతే, యిబ్బందే లేదమ్మా!" అన్నాడు ఆమెను పరీక్షించాలని.

సుమతి ఒకపక్క అన్నం వడ్డిస్తూనే, పీట మీద కూర్చోవడం చేతకాక బాధ పడుతున్న రాజుతో, "కుడి ఎడమైతే, యిబ్బంది ఎందుకుండదు? ఎప్పుడూ అతి సున్నితమైన హంసతూలికాతల్పాలు అనుభవించినవారికి, ఇలా పీట మీద కూర్చోవడం ప్రమాదకరంగానే వుంటుంది!" అన్నది.

రాజుకు, ఆ సమాధానంలోని అంతర్యం అర్థమై, "అయితే, అన్నింటికంటే ప్రమాదం, ఇలా స్థానభంగం జరగడమా?" అని ప్రశ్నించాడు.

దానికి సుమతి నవ్వి, "అన్నిటికంటే ప్రమాదమైనది, వేరే వున్నది లెండి." అన్నది.

అదేమిటో తెలుసుకోవాలన్న కుతూహలంతో రాజు విజయసేనుడు, "అదేమిటమ్మా?" అని అడిగాడు.

"అన్నిటికంటే ప్రమాదమైనది, వదంతే!" అన్నది సుమతి.

"వదంతి! నిజంగా అది, అంత ప్రమాదకరమైనదా?" అన్నాడు రాజు, సుమతి మాటలు నమ్మలేక.

"ఔను! వదంతులు నమ్మేమనిషి, తన విచక్షణాజ్ఞానాన్నీ, తార్కికశక్తినీ కోల్పోతాడు. దానితో అసత్యాన్ని సత్యంగా, సత్యాన్ని అసత్యంగా నమ్మేస్తాడు," అని జవాబిచ్చింది సుమతి.

సామాన్య కుటుంబంలో పుట్టిపెరిగిన సుమతికున్న తెలివితేటలు, రాజకుమారుడైన సుకేతుడికి లేకపోవడం గుర్తుకు వచ్చి, రాజుకు ఆమెపై కాస్త ఈర్ష్య కలిగింది.

రాజుకు నెయ్యి వేస్తూ, ఆయన ముఖకవళికల్లో వచ్చిన మార్పును గమనించిన సుమతి, "మనుషుల్లో సగం మంది బాధలకు, మూలకారణం ఏమిటో తెలుసు

కుంటే—అంతా సుఖంగా బతకవచ్చు.'' అన్నది.

ఆ మాటల్లోని భావమేమిటో తెలుసుకోవాలనుకుని, రాజు, ''అంతమందిని బాధించేదేమిటో తెలుసుకోవాలని వున్నది. చెప్పమ్మా!'' అన్నాడు.

''మనుషుల్లో సగంమందిని బాధించేది, ఈర్ష్య! ఆ కారణంవల్లనే, తమలో లేని ప్రత్యేకత ఇతరులలో కనిపించినప్పుడు, ఈర్ష్యపడతారు. అది కనబడనికొలిమిలా, వాళ్ళను దహించివేస్తూంటుంది,'' అని జవాబిచ్చింది సుమతి.

దానితో రాజు మౌనం వహించి భోజనం ముగిశాక చెయ్యి కడుక్కునేందుకు పెరట్లోకి వెళుతూ, ''ఇక్కడ చీకటి, మరీ యింత కారునలుపుగా వున్నదేమమ్మా?'' అన్నాడు.

సుమతి, ఆయన చేతి మీద నీళ్ళు పోస్తూ, ''అది ఎంత నల్లగా వున్నా, అబద్ధమంత నల్లగా లేదుగదా!'' అన్నది నవ్వుతూ.

రాజు విజయసేనుడు, ఆ మాటలు అర్థంకాక ఆశ్చర్యపడుతూండగా, సుమతి ఆయనకు తాంబూలం అందిస్తూ, ''క్షమించండి మహారాజా! ఏదో చిన్నదాన్ని, తెలియక అవాకులూ, చవాకులూ పేలి వుంటాను,'' అన్నది.

తను రాజునన్న సంగతి, మారు వేషంలో వున్నా, ఆ అమ్మాయికి అంత సులభంగా ఎలా తెలిసిపోయిందో, రాజుకు



అర్థం కాలేదు. ఆయన, ఆ సంగతి సుమతినడిగాడు.

అందుకామె, ''మీరు కాశీకి పోతున్న యాత్రికుడినన్నారు. అంతదూరం ఎవరూ ఒంటరిగా ప్రయాణం చెయ్యరు. మరి కొందరు యాత్రికులు తోడుగా వుంటారు. కాబట్టి, మీరు కాశీకి పోతున్న యాత్రికులుకారని ఊహించాను,'' అన్నది. చిన్నగా నవ్వుతూ.

''బావున్నది! మరి, నేను రాజునన్న విషయం ఎలా గ్రహించావు?'' అని అడిగాడు విజయసేనుడు.

''మీరు పీట మీద కూర్చుని భోజనం చేసిన తీరునుబట్టి, మీకు అలా కింద కూర్చుని భోజనం చేసే అలవాటు లేదని గ్రహించాను. మీరు భోజనానికి కూర్చుంటూ, కుడిచేతివేలికున్న వజ్రపుటుంగరాన్ని, ఎడమచేతికి మార్చారు. ఆ సమయంలో అది దీపకాంతికి మిరుమిట్లతో ధగధగమని మెరిసింది. అలాంటి ఉంగరం, ఏ గొప్ప ధనవంతుడో మాత్రమే ధరించగలడని, నాకు తెలును!'' అని సుమతి ఆగింది.

రాజు విజయసేనుడు చిన్నగా నవ్వి, ''ఆగావెందుకు ? చెప్పమ్మా, చెప్పు, వినడానికి చాలా కుతూహలంగా వున్నది,'' అన్నాడు.

''మహారాజా, ఈ చెప్పబోయేదానికి, తమరు, నన్ను క్షమించాలి! రాజ్యపాలకుల్లో, ఎక్కువమందికి బలమైన ఈర్ష్యాద్వేషాలుంటవని విన్నాను. నా చమత్కార సమాధానాలకు, తమ ముఖ కవళికల్లో వచ్చిన మార్పులు గమనించాక, ఆ సంగతి ధృవపడింది,'' అన్నది సుమతి.

సుమతి తెలివితేటలూ, సమయస్ఫూర్తీ, మర్యాదా రాజును బాగా ఆకర్షించినై. ఆయనకు, ఆమె తనకు కోడలు కావడానికి అర్హురాలన్న నమ్మకం కలిగింది.

ఆ తర్వాత కొద్ది రోజులకు యువరాజు సుకేతుడితో, సుమతి వివాహం వైభవంగా జరిగింది.





# ఉత్తరరామాయణం

కార్తవీర్యార్జునుడికి పట్టుబడి చెప్పరానంత అవమానం అనుభవించి, ఆ పిమ్మట విడుదల అయి కూడా రావణుడి మదగర్వం ఏమాత్రం అణగలేదు. అతను యథేచ్ఛగా ప్రపంచ మంతా తిరుగుతూ బలవంతులైన రాక్షసులనూ, మానవులనూ తనతో యుద్ధానికి రమ్మని సవాలు చేస్తూండేవాడు. అదేవిధంగా ఒకసారి అతను కిష్కింధకు వెళ్ళి, వాలిని యుద్ధానికి ఆహ్వానించాడు.

వాలి మంత్రి అయిన తారుడు రావణుడితో, "రావణా, ప్రస్తుతం వాలి కిష్కింధలో లేడు. మిగిలిన వానరులు నీతో యుద్ధం చెయ్యటానికి చాలరు గదా. వాలి సంధ్యావందనం చెయ్యటానికి నాలుగు సముద్రతీరాలకూ వెళ్ళి ఉన్నాడు. ఇదుగో ఈ ఎముకల గుట్ట చూడు. ఇది వాలి చేతిలో చచ్చినవారి ఎముకల పోగు. నువు కూడా ఆ గుట్ట మీద చేరదలిస్తే కొంచెం ఆగు, వాలి త్వరలోనే తిరిగి వస్తాడు. లేక మరీ అంత తొందరలో ఉన్నట్టయితే, దక్షిణ సముద్ర తీరానికి వెళ్ళి, అక్కడే వాలి చేతిలో శీఘ్రంగా చచ్చిపోవచ్చు." అన్నాడు.

రావణుడు తారుణ్ణి తిట్టి, పుష్పకం మీద దక్షిణ సముద్ర తీరానికి వెళ్ళాడు. అక్కడ అతనికి మేరుపర్వతం లాటి వాలి సంధ్య వార్చుతూ కనిపించాడు. రావణుడు కొంత దూరంలో పుష్పకం దిగి, వాలిని వెనక నుంచి పట్టుకునే

7. హనుమంతుడి వీరగాథ

ఉద్దేశంతో, అడుగుల చప్పుడు వినపడకుండా వాలిని సమీపించాడు. కాని హఠాత్తుగా వాలి వెనక్కు తిరిగి, రావణుణ్ణి చూసి, అతని ఉద్దేశం గ్రహించి కూడా, ఏమీ ఎరగనట్టు ఉండిపోయాడు. కాని రావణుడు సమీపంలోకి వచ్చినట్టు తెలియగానే వాలి, గరుత్మంతుడు పామును పట్టినట్టుగా, రావణుణ్ణి పట్టుకుని, చంకలో పెట్టుకుని, రివ్వున ఆకాశంలోకి లేచాడు.

రావణుణ్ణి విడిపించాలని అతని మంత్రులు కేకలు పెడుతూ వాలి వెంట పడ్డారు. కాని కొంత దూరం వెళ్ళి, వాలిని అందుకోలేక, అలిసిపోయి, వారు వెనక్కు వెళ్ళిపోయారు. అదే మంచి దయింది, లేకపోతే వారు వాలికి చిక్కి ప్రాణాలతో బయటపడి ఉండేవారు కారు.

వాలి రావణుణ్ణి చంకలో పెట్టుకుని పడమటి సముద్ర తీరాన దిగి, అక్కడ స్నానం చేసి, సంధ్య వార్చి, ఉత్తర సముద్రానికి వెళ్ళాడు, ఆ తరవాత తూర్పు సముద్రానికి వెళ్ళాడు. అన్ని సముద్రాల వద్దా సంధ్యానుష్ఠానాలు ముగించుకుని వాలి రావణుడితో సహా కిష్కింధకు తిరిగి వచ్చాడు. కిష్కింధలోని ఉద్యానంలో వాలి రావణుణ్ణి కిందికి దించి, నవ్వుతూ, "ఏం రావణా? ఎక్కడి నుంచి రావటం?" అని అడిగాడు.

రావణుడు వాలికి క్షమాపణ చెప్పుకుంటూ, "నీ వంటి బలశాలీ, వేగ



వంతుడూ సృష్టిలో మరొకడు లేడు. నన్ను పట్టుకుని నాలుగు సముద్రాలలోనూ నువ్వొక్కడివే ముంచగలిగావు. నీ శక్తి అపూర్వం, అమోఘం, నేను నీతో అగ్ని సాక్షికమైన స్నేహం వాంఛిస్తున్నాను,'' అన్నాడు.

ఆ ప్రకారమే వాళ్ళు వెంటనే అగ్నిని ప్రజ్వలింపజేసి, ఇద్దరూ ప్రేమతో కౌగలించుకుని, భ్రాతృస్నేహం అవలంబించారు. రావణుడు కిష్కింధలో ఒక నెల రోజు లుండి, సుగ్రీవుడు పొందే మర్యాద లన్నీ పొందాడు. తరవాత రావణుణ్ణి, అతని మంత్రులు వచ్చి సగౌరవంగా లంకకు తీసుకుపోయారు.



అగస్త్యుడు రాముడికి ఈ వృత్తాంతం చెప్పి, ''రామా, నీ చేతిలో ఒక్క బాణంతో చచ్చిన వాలి అలాటి అపార బలసంపన్నుడు!'' అన్నాడు.

దానికి రాముడు, ''అగస్త్యమహర్షీ, వాలి బలమూ, రావణుడి బలమూ అపూర్వమైనవని నేను అంగీకరిస్తాను గాని, నా ఉద్దేశంలో హనుమంతుడు వీరి కన్న కూడా శక్తిమంతుడుగా కనిపిస్తాడు. అతడు నూరు యోజనాల సముద్రాన్ని లంఘించటమే గాక, రావణుడి లంకలోని అంతఃపురంలోకి అవలీలగా ప్రవేశించి, ఎందరో రాక్షసవీరులను ఒంటరిగా చంపి, లంకానగరాన్ని తగలబెట్టినవాడు. అతను చేసిన సాహసాలు మూడు లోకాలలోనూ ఎవరికీ సాధ్యం కావనిపిస్తుంది. అంత మహా బలశాలి వాలిని చంపకుండా, తన రాజైన సుగ్రీవుడు అష్టకష్టాలూ పడుతూంటే ఎందుకు చూస్తూ ఊరుకున్నాడు? ఈ నా సందేహాన్ని తీర్చండి,'' అని కోరాడు.

అది విని అగస్త్యుడు, ''రామా, హనుమంతుణ్ణి గురించి నీ వన్నదంతా నిజమే. అంతటి బలశాలీ, వేగవంతుడూ, బుద్ధిశాలీ మరొకడుండడు. అతడు అతి బాల్యంలోనే ఎన్నో అద్భుతాలు చేశాడు. బహుశా అతని కా విషయాలు జ్ఞాపకం



కూడా ఉండవు. కాని మును లతనికి బాల్యంలోనే శాపం ఇచ్చారు. అతని విచిత్ర కథ చెబుతాను.'' అంటూ ఇలా చెప్పాడు :

హనుమంతుడి తండ్రి కేసరి మేరు పర్వతం మీద రాజ్యం చేస్తూ ఉండేవాడు. కేసరి భార్య అంజన. ఆమె వాయుదేవుడి వరంతో హనుమంతుణ్ణి కన్నది. పసివాడైన హనుమంతుణ్ణి ఆమె ఒక చోట పడుకోబెట్టి పళ్ళు తెద్దామని అడవికి పోయింది. ఇంతలో హనుమంతుడికి ఆకలి అయి ఏడపసాగాడు. అప్పుడే తూర్పుకొండ మీద ఎర్రగా సూర్యబింబం ఉదయించింది. అదేదో పండు అనుకుని దాన్ని పట్టుకోవటానికి ఆ శిశువు తిన్నగా ఆకాశంలో ఎగిరి వెళ్ళసాగాడు. సూర్యుడి కెదురుగా వెళ్ళే మరొక సూర్యుడి లాటి హనుమంతుణ్ణి చూసి, దేవతలూ, దానవులూ, యక్షులూ, గంధర్వులూ దిగ్భ్రమ చెందారు. ఎందుకంటే, అప్పటికే అతని వేగం వాయువేగాన్నీ, గరుత్మంతుడి వేగాన్నీ మించింది.

అలా సూర్యుడి కేసి ఎగురుతూ పోతున్న తన కొడుకు వెంట వాయుదేవుడు కూడా పరిగెత్తుతూ, ఆ శిశువుకు సూర్యుడి వేడి తగలకుండా మంచు బిందువులు చల్లుతూ వెళ్ళాడు. ఈ విధంగా తనను అతి వేగంగా సమీపించే బాల హనుమంతుడి పైన సూర్యుడు కూడా తన ప్రతాపం చూపలేదు.

అదీ గాక, హనుమంతుడు సూర్యుణ్ణి చేరుకునే సమయానికే సూర్యుణ్ణి పట్టటానికి రాహువు కూడా సూర్యుడి రథం పైకి వచ్చాడు. రాహువును చూడగానే హనుమంతుడు సూర్యుణ్ణి వదిలేసి రాహువును పట్టుకోబోయాడు. రాహువు భయపడి పారిపోయి, నిండు సభలో ఉన్న ఇంద్రుడి వద్దకు వెళ్ళి, ''ఇంద్రా, ఏమిటీ అన్యాయం? పర్వకాలం గదా అని నేను సూర్యుణ్ణి మింగబోయే సమయంలో అక్కడికి మరొక రాహువును

పంపావు. వాడు సూర్యుడితోబాటు నన్ను కూడా పట్టుకుని మింగబోయాడు,'' అన్నాడు.

వెంటనే ఇంద్రుడు రాహువును వెంట బెట్టుకుని ఐరావతం మీద సూర్యుడి వద్దకు వచ్చాడు. ఇంకా అక్కడే ఉన్న హనుమంతుడు రాహువును చూడగానే పట్టుకో వచ్చాడు.

''ఇంద్రా, రక్షించు, రక్షించు,'' అన్నాడు రాహువు.

''నేను వీణ్ణి చంపుతాను, భయపడకు,'' అని ఇంద్రుడు రాహువుతో అంటూండగానే హనుమంతుడు ఐరావతాన్ని చూసి, అదేదో తెల్లని పండనుకుని, దానిపైకి వచ్చాడు. ఇంద్రుడు తన చేతిలో ఉన్న వజ్రాయుధంతో మెల్లగానే హనుమంతుణ్ణి కొట్టాడు. ఆ దెబ్బకు బాల హనుమంతుడు ఒక కొండ మీద పడిపోయాడు. అతని ఎడమ దవడ నలిగిపోయింది.

తన కొడుకును కొట్టినందుకు ఇంద్రుడిపైన కోపం వచ్చి వాయుదేవుడు ప్రపంచమంతటా సంచరించటం మాని, తన కొడుకు నెత్తుకుని ఒక కొండ గుహలో కూర్చున్నాడు. ప్రాణులన్నీ ఉక్కిరిబిక్కిరి అయిపోయాయి. గంధర్వులూ, దేవతలూ మొదలైనవారు బ్రహ్మ దగ్గిరికి వెళ్ళి మొర పెట్టుకున్నారు. బ్రహ్మ వారందరినీ వెంటబెట్టుకుని వాయుదేవుడున్న గుహకు వెళ్ళాడు. బ్రహ్మ మొద





యుద్ధం చేత దెబ్బ తగలకుండా ఇంద్రుడు వరమిచ్చాడు. సూర్యుడు హనుమంతుడికి తన తేజస్సులో ఒక శాతం ఇచ్చాడు, హనుమంతుడు గొప్ప వక్తా, మహా పండితుడూ అయేటట్టు వరం కూడా ఇచ్చాడు. హనుమంతుడికి జలగండం లేకుండా వరుణుడూ, కాలదండం వల్ల చావు లేకుండా యముడూ, తన గద వల్ల హనుమంతుడికి ప్రమాదం కలగకుండా కుబేరుడూ వరా లిచ్చారు. తనవల్ల గాని, తన అస్త్రాలవల్ల గాని, హనుమంతుడికి అపాయం లేకుండా శివుడు వరమిచ్చాడు. బ్రహ్మదేవుడూ, విశ్వకర్మా కూడా అలాటి వరాలే ఇచ్చారు. ఈ వరాలన్నిటివల్లా హనుమంతుడు శత్రువులకు భయంకరుడూ, యుద్ధంలో ఓటమి లేనివాడూ, కామరూపీ, కామగమనం గలవాడూ అయాడు.

వాయుదేవుడు పొందిన సంతోషం అంతా ఇంతా కాదు.

ఆ తరవాత హనుమంతుడు అపార బలసంపన్నుడై, నిర్భయంగా సంచరిస్తూ, ఆశ్రమాలలోని మునులకు నానా యాతనలూ కలిగిస్తూ వచ్చాడు. అతను దేవతల చేత అమోఘమైన వరాలు పొందినవాడని తెలిసిన మునులు, అతను తమ నారబట్టలనూ, అగ్ని హోత్రాలనూ,

లైన వారిని చూడగానే వాయుదేవుడు తన కొడుకు నెత్తుకుని వచ్చి, బ్రహ్మ కాళ్ళ మీద పడ్డాడు. బ్రహ్మ చేతితో నిమరగానే, ప్రాణం కడబట్టి ఉన్న హనుమంతుడు తిరిగి ఎప్పటి లాగా అయాడు. వాయుదేవుడు సంతోషించి, తిరిగి ప్రపంచ మంతటా సంచరించ సాగాడు.

వాయుదేవుణ్ణి మరింత సంతోషపెట్టే ఉద్దేశంతో బ్రహ్మ, దిక్పాలకులను హనుమంతుడికి వరా లివ్వమన్నాడు. తన మూలంగా హనువు (దవడ) దెబ్బ తిన్నది గనక అతనికి హనుమంతుడని పేరు పెట్టుతూ, ఇక ఎన్నటికీ అతనికి వజ్రా

కుండలనూ, కృష్ణాజినాలనూ ధ్వంసం చేస్తూ ఉన్నప్పటికీ చూసీ చూడనట్టుగా ఉండిపోయారు.

ఒకవంక కేసరీ, మరోవంక వాయుదేవుడూ వద్దని చెబుతున్నా హనుమంతుడు తన అకతాయితనం ఎంతమాత్రం మానలేదు. చివరకు మహర్షులు హనుమంతుడిపైన అలిగి, "నీ బలం చూసుకునే గదా నువ్విదుండగాలు చేస్తున్నావు? ఇంకొకరు చెబితే తప్ప నీ బలం నీకు తెలియక పోవుగాక!" అని అతడికి శాపం పెట్టారు.

అటుపైన హనుమంతుడు తన సంగతి తానే ఎరగకుండా బుద్ధిమంతుడై ఆశ్రమాలలో ఉంటూ వచ్చాడు.

ఆ కాలంలో వాలి సుగ్రీవుల తండ్రి అయిన ఋక్షరజసుడు వానర రాజుగా ఉంటూ చనిపోయాడు. అప్పుడు వానరులు, పెద్దవాడైన వాలికి రాజ్యాభిషేకం చేసి, చిన్నవాడైన సుగ్రీవుణ్ణి యువరాజు చేశారు. హనుమంతుడికీ, సుగ్రీవుడికీ బాల్యంలోనే ఎడతెగని స్నేహం ఏర్పడింది. కాని, వాలికీ, సుగ్రీవుడికీ వైరం ఏర్పడి, సుగ్రీవుడు నానా పాట్లూ పడినప్పుడు హనుమంతుడు తన బలం తానే ఎరగని కారణం చేత అతనికి ఏ విధంగానూ సహాయపడలేక పోయాడు.

ఈ విధంగా హనుమంతుడి కథ రాముడికి చెప్పి, ఆ తరవాత అగస్త్యమహాముని, "రామా, ఈ హనుమంతుడు ఎలాటి శక్తి గలవాడనుకున్నావు? ఇతడు వ్యాకరణం నేర్చుకోగోరి సూర్యుడితో బాటు తను కూడా రోజూ ఉదయగిరి నుంచి అస్తగిరి దాకా తిరిగేవాడు. ముల్లోకాలలో, ఏ విద్యలోనూ ఇతనితో సమానులు లేరు. ఇతను ముందు కాబోయే బ్రహ్మ," అన్నాడు.

ఈ విధంగా హనుమంతుడి కథ విన్న రాముడు అగస్త్యుడితో, "స్వామీ వాలి సుగ్రీవుల తండ్రి అయిన ఋక్షరజసుడెవరు? వారి తల్లి ఎవరు? ఆ కథ కూడా వివరంగా చెబితే విని సంతోషిస్తాను," అన్నాడు.






మలయ పరిసర ప్రాంతంలో మారదేవుడనే ఒక ఇంద్రజాలికు డుండేవాడు. అతనికి అనేక మంత్రవిద్యలు తెలుసు. కాని, అతను వాటిని ధనార్జనకు వినియోగించక, బీదవాడు గానే ఉంటూ వచ్చాడు. మారదేవుడికి లవుడనే కొడుకుండేవాడు. వాడికి తండ్రి తన మంత్ర విద్యలన్నీ శ్రద్ధగా నేర్పించాడు.

తండ్రి లాగా కాక లవుడికి తన విద్యలతో ధనమూ, కీర్తీ గడించాలని తృష్ణ కలిగింది. అందుచేత వాడు స్వగ్రామం విడిచి దేశాలవెంబడి బయలుదేరాడు. అనేకమంది రాజులు వాడి ఇంద్రజాల విద్యను చూసి, మెచ్చుకుని మంచి బహుమానా లిచ్చారు. ఇలా దేశాటన చేస్తూ లవుడు తోరణ దేశానికి వచ్చాడు. అతను అక్కడి రాజు వద్దకు వెళ్ళి, తాను ఇంద్రజాలికుణ్ణనీ, తన విద్యతో అనేకమంది రాజులను మెప్పించాననీ, రాజుగారి అనుమతి అయితే ఇక్కడ కూడా ప్రదర్శన ఇస్తాననీ విజ్ఞాపన చేసుకున్నాడు.

తోరణదేశపు రాజుకు లేకలేక ఒక ఏడాది క్రితమే ఒక మగపిల్లవాడు కలిగాడు. ఆ పిల్లవాడి జాతకం చూసిన జ్యోతిష్కులు రెండో ఏట ఆ పిల్లవాడికి ఒక ఇంద్రజాలికుడి మూలాన హీనయోగం కలుగుతుందని చెప్పారు. అది మొదలు రాజుకు ఇంద్రజాలమన్నా, ఇంద్రజాలికులన్నా సింహస్వప్నంగా ఉంటున్నది.

ఇప్పుడు లవుడు వచ్చి తాను ఇంద్రజాలికుణ్ణని చెప్పగానే రాజుకు దడ పుట్టుకొచ్చింది. తన కొడుకు భద్రసేనుడికి రెండో ఏడు ప్రవేశించగానే ఈ ఇంద్రజాలికు డెక్కడి నుంచో ఊడిపడ్డాడు! వీడివల్ల తన కొడుక్కు ఏదో కీడున్నది!



కుని చనిపోయాడు. తెల్లవారే లోపుగా మంత్రి లవుడి శవాన్ని నౌకర్ల చేత రహస్యంగా పాతేయించాడు.

ఎంత రహస్యంగా జరిగినప్పటికీ, ఈ దారుణ హత్య గురించి వార్త పొక్కనే పొక్కింది. కొద్ది మాసాలలో అది మారదేవుడి దాకా వెళ్ళింది. తన కొడుకును హత్య చేశారన్న మాట నిజమో కాదో తెలుసుకునేటందు కతను స్వయంగా బయలుదేరి, తోరణ దేశానికి చేరుకున్నాడు. లవుడు తోరణకు వచ్చినట్టు తెలిసిన వారున్నారు, కాని వాడు అక్కడి నుంచి ఎటు వెళ్ళాడో, ఏమయాడో చెప్పిన వారు లేరు. లవుణ్ణి దివాణానికి అతిథిగా పిలిచి చంపించారన్న వార్త నగరంలో చాలామంది విని ఉన్నారు.

మారదేవుడు స్వతః చాలా మంచివాడు. కాని, ఏ కారణమూ లేకుండా రాజు తన కొడుకును చంపించాడని విన్న మీదట అతనిలో పగ రగిలింది. అతను రాజభవనం ప్రాంతంలోనే సంచరిస్తూ రాజకుమారుణ్ణి దాసీలు వనవిహారానికి తీసుకు వచ్చినప్పుడు తన విద్యలతో ఆ దాసీలను ఏమార్చి, కనికట్టు చేసి, రాజకుమారుణ్ణి ఎత్తుకుని తన దేశానికి తిరిగి వెళ్ళిపోయాడు. అతను ఇంటికి చేరుకుని, రాజకుమారుడి దుస్తులూ, ఆభరణాలూ విప్పి

రాజిలా అనుకుని మంత్రితో రహస్యంగా మాట్లాడి, ఎలాగైనా ఈ ఇంద్రజాలికుణ్ణి కడతేర్చే ఉపాయం చూడమన్నాడు. మంత్రి లవుణ్ణి ఏకాంతంగా పిలిపించి, "ఇంద్రజాల విద్య అంటే మహారాజుగారికి చాలా ఇష్టం. అందుచేత, నీకు ప్రత్యేకమైన అతిథి సత్కారం ఏర్పాటు చేయమన్నారు. ఇవాళ నువు దివాణంలోని అతిథి గృహంలో రాజుగారి ఆతిథ్యం స్వీకరించు. నీ ప్రదర్శనం రేపటికి ఏర్పాటు చేస్తాం," అన్నాడు.

లవుడు పరమానందభరితుడై అందుకు సమ్మతించాడు. ఆ రాత్రే అతను మంత్రి పెట్టించిన విషాన్నం తిని విలవిల తన్ను

ఒక పెట్టెలో పెట్టి, ఆ కుర్రవాణ్ణి తన కొడుకు లాగే పెంచసాగాడు.

తోరణ రాజు తన కొడుకు నెవరో ఎత్తుకుపోయారని తెలియగానే హతాశుడై పోయాడు. తాను తీసుకున్న జాగ్రత్త అంతా వృథా అయింది. లేక లేక, కలిగిన కొడుకు కాస్తా పోనే పోయాడు. కొడుకు కోసం విలపిస్తున్న రాజుతో మంత్రి, "మహారాజా, విచారించకండి. ఏది జరుగుతుందని రాసి పెట్టి ఉన్నదో అదే జరిగింది. అబ్బాయిని ఎత్తుకుపోయిన వాడు తప్పక ఐంద్రజాలికుడే అయి ఉంటాడు; మనం చంపిన కుర్రవాడి తండ్రో, దగ్గర బంధువో అయి ఉంటాడు. ఇది మనం చేజేతులా చేసుకున్నదే నని నాకు తోస్తున్నది. అయినా మన జ్యోతిష్కులు అబ్బాయికి ప్రాణహాని ఉన్నట్టు చెప్ప లేదు. కొంత కాలానికి మంచి రోజులు వచ్చి అతనే వస్తాడు," అన్నాడు.

లవుడు హత్య చేయబడే నాటికి పదహారేళ్ళ వాడు. మారదేవుడు రాజకుమారుణ్ణి పదహారేళ్ళు నిండేదాకా పెంచి తన పగ తీర్చుకునే ప్రయత్నం ప్రారంభించాడు. అతను రాజపుత్రుణ్ణి వెంటబెట్టుకుని తోరణ దేశానికి వచ్చి, ఒక సత్రంలో దిగాడు. అతను రాజకుమారుడితో, "నాయనా, నువ్వీ పెట్టె తీసుకుని రాజు



గారి దర్శనం చెయ్యి. నువు పసివాడివై ఉండగా నీ అన్న ఈ తోరణ రాజుగారి ఆతిథ్యం పొందాడు. వారు మీ అన్న కిచ్చిన బహుమానానికి బదులుగా ఈ పెట్టెను వారి కిస్తున్నట్టు చెప్పి మరీ ఇయ్యి." అన్నాడు.

రాజపుత్రు డాశ్చర్యంతో, "నా కొక అన్న ఉన్నాడా? ఇంతకాలమూ చెప్పనే లేదే?" అన్నాడు.

"ముందు నే చెప్పినట్టు చెయ్యి. తరవాత మీ అన్న సమాచారం నీకే తెలుస్తుంది!" అన్నాడు మారదేవుడు.

రాజపుత్రుడు పెట్టె తీసుకుని రాజుగారి దర్శనం కోసం సభకు వెళ్ళాడు. అతను

రాజుగారికి నమస్కారం చేసి, ''మహా రాజా, నేను మారదేపు డనే ఐంద్రజాలి కుడి కొడుకును. చాలా ఏళ్ళక్రితం మా అన్న ఇంద్రజాలం చూపిస్తానని వచ్చి నప్పుడు మీరు అతనికి ఆతిథ్య మిచ్చి మంచి బహుమాన మిచ్చారు. అందుకు ప్రతి బహుమానంగా మా తండ్రి మీ కీ పెట్టె ఇవ్వమన్నాడు,'' అంటూ తాను తెచ్చిన పెట్టెను రాజుగారి ముందు పెట్టాడు. రాజుగారు పెట్టె మూత తీసి చూడగానే, తన కొడుకు కనిపించకుండా పోయినప్పుడు ధరించిన దుస్తులూ, నగలూ అందులో ఉన్నాయి.

దుఃఖంతోనూ, కోపంతోనూ ఆయనకు మతిపోయినట్టయింది. ఆయన ఆవేశంతో కత్తి దూసి తన కొడుకును చంపబోయాడు. మంత్రి ఆయనకు అడ్డుపడి, ''తొందర పడకండి మహారాజా. ఇవి అబ్బాయి వస్తువులన్నమాట నిజమే. కాని ఆ ఇంద్ర జాలికుడు అబ్బాయిని నిజంగా చంపి ఉన్నట్టయితే వాటిని అప్పుడే పంపించి ఉండేవాడు. ఈ కుర్రవాడు చూడగా అబ్బాయి వయసుగానే కనిపిస్తున్నాడు,'' అన్నాడు.

మంత్రి రాజుగారి ముందున్న పెట్టె నుండి వస్తువులను ఒక్కొక్కటే బయటికి తీయగా, అట్టడుగున ఒక చిన్న చీటీ ఉన్నది. అందులో ఇలా ఉన్నది: ''రాజా, నీ కొడుకునే నీవు హత్య చేశావు. ఒకనాడు నా కొడుకును చంపించినందుకు నే నిలా పగ తీర్చుకున్నాను.''

మంత్రి అడ్డుపడి ఉండకపోతే, ఇంద్ర జాలికుడు ఊహించినట్టుగానే ఆయన తన కొడుకును తానే చంపి ఉండేవాడు. రాజు తన కొడుకును ఆప్యాయంగా కౌగిలించుకుని ఆనంద బాష్పాలు రాల్చాడు. ఆయన వెంటనే తన మనుషు లను సత్రానికి పంపి ఇంద్రజాలికుణ్ణి తన వద్దకు పిలిపించి, లవుణ్ణి తాను నిష్కా రణంగా చంపినందుకు క్షమాపణ చెప్పుకుని, అతని కొక మంచి ఈనాం ఇచ్చి తనవద్దనే ఉంచుకున్నాడు.





# మాటకు మాట

ఒక రాజుకు అమిత మాటకారి అయిన కూతురు ఉండేది. ఆమెతో మాట్లాడటం ఎవరికీ సాధ్యమయేది కాదు. అందుచేత రాజు, తన కుమార్తెను మాటకారి తనంలో జయించిన వాడికి ఆమె నిచ్చి పెళ్ళి చెయ్యటమే గాక, అర్ధరాజ్యం కూడా ఇస్తానని ప్రకటన చేశాడు.

అర్ధరాజ్యం కట్నంతో వస్తున్న రాజకుమార్తెను పెళ్ళాడటానికి అడ్డమైనవాళ్లూ ముందుకు వచ్చారు. అయినా ఎవరూ రాజకుమార్తెతో మాటకు మాట అనలేక పోయారు.

చివరకు రాజు విసిగి, రాజకుమార్తెతో ఓడిపోయిన వారి చెవులకు కర్రులు కాల్చి వాతలు వేయిస్తా నన్నాడు.

రాజకుమార్తె పెళ్ళి వార్త విని ముగ్గురు అన్నదమ్ములు బయలుదేరారు. వాళ్ళకు జరుగుబాటు తక్కువగా ఉండటం చేత అర్ధరాజ్యం సంపాదించుకుంటే బాగుంటుందని తోచింది. దారిలో ఒక చచ్చిన గోరింక కనిపించింది. మూడోవాడు దాన్ని తీసుకుని, ''నా కేం దొరికిందో చూడండి,'' అని అన్నలతో అన్నాడు.

''అది ఎందుకురా? పారెయ్యి అవతల!'' అన్నారు అన్నలు.

''ఎందుకైనా పనికి రావచ్చు.'' అంటూ మూడోవాడు దాన్ని దాచుకున్నాడు.

మరి కొంతదూరం వెళ్ళాక వాడికి ఒక నారతడప దొరికింది. అన్నలు పారెయ్యమంటే వినక, వాడు దాన్ని కూడా దాచాడు.

ఇలా వాడికి దారిలో వరసగా ఒక కుండ పెంకూ, రెండు పొటేలు కొమ్ములూ, ఒక కొయ్యమేకూ, పాత చెప్పూ దొరికాయి.

ముందు పెద్దవాడు రాజకుమార్తెతో మాట్లాడబోయి, ''సుదినం! ఇక్కడ చాలా వేడిగా ఉన్నదే!'' అన్నాడు.

నార్వే జానపద కథ

"అందులో ఇంకా వేడిగా ఉంటుంది." అంటూ రాజకుమార్తె సమీపంలో ఉన్న కొలిమిని చూపించింది. ఆ కొలిమిలో రెండు ఇనపకచ్చులు ఎర్రగా కాలి ఉన్నాయి. వాటిని చూడగానే పెద్దవాడికి నోటమాట రాలేదు. రెండు చెవులకూ వాతలు వేయించుకుని బయటికి వెళ్ళాడు.

రెండోవాడి గతి కూడా అంతే అయింది.

తరవాత మూడోవాడు వచ్చి, "సుదినం! ఇక్కడ చక్కగా వెచ్చగా ఉన్నది," అన్నాడు. రాజకుమార్తె కొలిమి చూపించి, "అది చాలా వేడి!" అన్నది.

"అందులో ఈ గోరింకను కాల్చుకోవచ్చు," అన్నాడు వాడు.

"ముక్కలై రాలిపోతుంది," అన్నది రాజకుమార్తె.

"ఈతడపతో కట్టితే సరి," అన్నాడువాడు.

"చాలా వదులవుతుంది," అన్నది రాజకుమార్తె.

"ఈ కొయ్యశీల దూర్చితే సరి!" అన్నాడు వాడు.

"కొవ్వు కారిపోతుంది," అన్నది రాజకుమార్తె.

"ఈ కుండపెంకు అడ్డం పెడతాను," అన్నాడు వాడు.

"ప్రతి మాటకూ ఏదో మెలిక పెడతావే!" అన్నది రాజకుమార్తె.

"మెలిక నా మాటలకు కాదు, దీనికి చూడు!" అంటూ వాడు ఒక పొటేలు కొమ్ము పైకి తీశాడు.

"ఇదెక్కడా ఎరగం!" అన్నదామె.

"అలాటిది ఇంకోటి కూడా ఉన్నది," అంటూ వాడు రెండో కొమ్ము పైకి తీశాడు.

"నన్ను జయించటానికి మహా నలిగిపోతున్నావు," అన్నది రాజకుమార్తె.

"నలిగి అరిగి పోయేది నేను కాదు, ఈ చెప్పు!" అన్నాడు వాడు.

ఆ తరవాత ఏమనాలో రాజకుమార్తెకు తోచలేదు. ఆమె ఓడిపోయినట్టు ఒప్పుకుని మూడోవాణ్ణి పెళ్ళి చేసుకున్నది. వరకట్నం కింద వాడు అర్ధరాజ్యం సంపాదించుకున్నాడు.





# అపకారికి ఉపకారం

## 2

ప్రియంవద తమ పెళ్లి విషయమై, ఏదో ఉపాయం చెబుతాననగానే, జయుడు, ఒక క్షణం మౌనంగా వూరుకుని, తర్వాత భయంగా, ''ఏమిటది?'' అని అడిగాడు.

''జాగ్రత్తగా విను. అంతఃపురంలో నుంచి బయటపడడానికి, ఒక రహస్య సొరంగమార్గం వున్నది. నేను ఆ మార్గాన బయటికి వెళ్ళిపోతాను. నగరంలో, నీ ఇంటి వివరాలు చెప్పు. మారువేషంలో, అక్కడికి వస్తాను.'' అన్నది ప్రియంవద.

''మీరు అంతఃపురంలో లేరని తెలియగానే, ఎంత కల్లోలం బయలుదేరుతుందో, ఆలోచించారా?'' అని అడిగాడు జయుడు.

''ఆ మాత్రం నాకు తెలియకపోలేదు. ఈలోగా, నువ్వు చేయవలసినదేమంటే, ఉద్యానవనంలోకి, ఒక మాంత్రికుడొచ్చి, రాకుమారిని ఎత్తుకుపోయాడని గొడవ చేయడం. అప్పుడు, మా నాన్న ఒక ప్రకటన చేస్తాడు. మాంత్రికుడి బారినుంచి ఎవరు నన్ను రక్షిస్తే, వారికి నన్నిచ్చి వివాహం చేస్తానని. కొన్నాళ్ళాగి నువ్వు, నన్ను మా నాన్న దగ్గిరకు తీసుకుపోయి, మాంత్రికుణ్ణి చంపేశానని చెప్పు. నువ్వు చెప్పినవన్నీ, నిజమేనని నేనూ చెబుతాను. అప్పుడు, నీకు మహావీరుడన్న కీర్తివస్తుంది. మన వివాహం జరుగుతుంది. ఎవరికీ ప్రమాదముండదు, ''అన్నది ప్రియంవద.

జయుడికి, ఈ ఉపాయం నచ్చింది. వాడు, ప్రియంవదతో, ''నువ్వెలా చెబితే, అలా చేస్తాను, రాజకుమారీ!'' అన్నాడు.

జయుడి జవాబుకు తృప్తిపడి, ప్రియంవద అంతఃపురానికి తిరిగి వచ్చింది.

"వసుంధర"



ఆమె తన పథకాన్ని అమలు చేయడం గురించి చాలా దీర్ఘంగా ఆలోచించింది. ముందు ఆమె, అంతఃపురంలోని రహస్య సొరంగానికి సంబంధించిన పూర్తివివరాలు రాబట్టాలనుకున్నది. కాని, ఇందుకు ఎవరినడగాలి ? తల్లి నడిగితే, ఆమె అనుమానించవచ్చు.

ప్రియంవదకు, ఆ సొరంగ మార్గం ఎక్కడ వున్నదీ, అందులోకి ఎలా ప్రవేశించాలన్నంతవరకు తెలుసు. అయితే, అదెక్కడికి దారి తీస్తుందో మాత్రం, ఆమెకు తెలియదు. ఆ సంగతి తెలుసుకునేందు కామె, ఆనాటి అర్ధరాత్రివేళ సొరంగంలో ప్రవేశించింది.

ఆ సొరంగానికి, మొత్తం మూడు ప్రవేశమార్గాలున్నవి. ఒకటి, రాజు మంత్రాంగమందిరంలోనూ, మరొకటి, రాణి శయనాగారంలోనూ, వేరొకటి రాజకుమారి శయనమందిరంలోనూ వున్నవి. రాజకుమారి నిద్రించే హంసతూలికా తల్పం కింద వున్న రాతిపలకను తొలగించితే, దిగువకు మెట్లుంటవి. లోనికి దిగి, తిరిగి రాతిపలకను ఎప్పటిలా అమర్చవచ్చు.

ప్రియంవద, ఆ విధంగా చేసి, సొరంగ మార్గాన కొద్ది దూరం నడిచింది. అంతా కటికచీకటి. కొద్దిసేపటికి ఆమె కళ్ళు, ఆ చీకటికి అలవాటుపడినై. ఆమె ముందుకు నడవసాగింది. అలా ఎంత దూరం నడిచినా, దాని అంతు కనిపించడం లేదు. సొరంగం చివరికిపోయి, దాని వివరాలు జయుడితో చెప్పాలనుకున్నదామె, కాని, ఇప్పుడది సాధ్యంగా తోచలేదు.

త్వరగా సొరంగం చివరిభాగం చూడాలన్న ఆత్రం కొద్దీ, ప్రియంవద పరిగెత్తడం ప్రారంభించింది. అలా కొంత దూరం పరిగెత్తేసరికి ఆమెకు ఆయాసం వచ్చింది ఇక, ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేక, ఉన్నచోటునే కూర్చున్నది. అసలే, బాగా అర్ధరాత్రివేళ బయలుదేరిందేమో, ఆమెకు నిద్రముంచుకురాసాగింది.

దానికితోడు విపరీతమైన అలసట. అందు వల్ల, ప్రియంవద, ఆ సొరంగమార్గంలోనే ఒళ్ళు తెలియకుండా నిద్రపోయింది.

అలా ఎంతసేపు నిద్రపోయిందో, ఆమెకు తెలియదు. హఠాత్తుగా మెలుకువ వచ్చి, ప్రియంవద ఉలిక్కిపడి లేచి కూర్చున్నది. చుట్టూ చీకటి. ఆమెకు వెంటనే తను సొరంగమార్గంలో వున్నట్టు గుర్తురాలేదు. ఆ సంగతి గుర్తుకురాగానే, లేచి నిలబడింది. అయితే, కటిక నేల మీద నిద్రపోవడంవల్ల, ఆమెకు ఒళ్ళంతా నొప్పులుగా వున్నది. ఆమెకు ఆశ్చర్యం కలిగింది! పడుకున్నది కటిక నేల కావడం వల్ల, తనకు ఒళ్ళంతా నొప్పులుగా వున్నా, ఏనాడూ పట్టుపరుపుల మీద కూడా యింత హాయిగా నిద్రపట్టలేదు!

సొరంగమార్గాన తను యింతదూరం వచ్చిన తర్వాత, యిప్పుడేం చేయడమా అన్న సమస్య, ప్రియంవదకు, ఎదు రయ్యింది. ఇప్పుడు తిరిగి వెనక్కు వెళ్ళడంవల్ల ప్రయోజనం వుండదు. ఇప్పటికే తను కనబడడం లేదన్న సంగతి, అంతఃపురంలో గగ్గోలు కలిగించి వుంటుంది. జయుడు తను చెప్పిన ప్రకారం తప్పక చేస్తాడు. అందువల్ల, ధైర్యంగా ముందుకుపోవడమే మంచిదను కున్నది, ప్రియంవద.



ఆమె పట్టుదలగా ముందుకు నడవ సాగింది. అయితే, కాలం గడుస్తున్నా, సొరంగమార్గం చివర దగ్గిరపడడం లేదు. హఠాత్తుగా ఆమెకు ఒకసారి, తన తండ్రి, తల్లితో అన్నమాటలు గుర్తుకువచ్చినై. సొరంగమార్గాన పోదలచినప్పుడు, కొన్ని ఆహారపదార్థాలు వెంట తీసుకువెళ్ళడం అవసరం. ప్రయాణం సుమారు రెండు రోజులు పడుతుంది!

ఈ సంగతి గుర్తురాగానే, ప్రియంవదకు దుఃఖం వచ్చింది. తను రెండు రోజుల ప్రయాణానికి సరిపడా, ఆహారపదార్థాలు వెంట తీసుకురావలసింది! ఇప్పుడు, తిండి లేకుండా, అంత దూరం ప్రయాణం

చేయగలదా ? ఏది ఏమైనా, రోట్లో తల దూర్చి రోకటి పోటుకు వెరచి ప్రయోజనం వుండదు. ఉపకారికి ఉపకారం చేయడం కోసం, తన తల్లిదండ్రుల దుష్టపథకాన్ని తారుమారు చేయడం కోసం—తను ఎన్ని కష్టాలకైనా ఓర్చుకోవాలి. అనుకున్నదాన్ని సాధించి తీరాలి!

ప్రియంవద అలాగే అన్నపానాలు లేకుండా, కటికమార్గంలో పాదాలు నొచ్చుతున్నా భరించి—సొరంగమార్గం చివరకు చేరుకున్నది. మార్గం ఒక మహా వృక్షం మొదలు లోనికి దారి తీసినట్టు, ఆమె గ్రహించింది. అక్కడ భూమిలోనికి పాతుకుపోయిన లావుపాటి చెట్టువేళ్ళు, ఆమెకు కనిపించినై. చెట్టుబోదె లోపలికి సన్నని దారి వున్నది. ప్రియంవద సందేహించకుండా, అందులో ప్రవేశించింది. అక్కడ పైకి వెళ్ళేందుకు మెట్లున్నవి. ఆమె, ఆ మెట్లెక్కింది.

మళ్ళీ చీకటి. కాని, ఒక పక్కనుంచి సన్నని వెలుతురు వస్తున్నది. ప్రియంవద, ఆ వెలుతురును జాగ్రత్తగా గమనించి, అక్కడ చేయి పెట్టి తడిమింది. చేతికి తలుపు గడియలాటిది తగిలింది. దానిని పక్కకు లాగగానే, తలుపు తెరుచుకుని, రయ్యిమంటూ చల్లనిగాలి, ఆమె ముఖాన్ని తాకింది.

ప్రియంవదకు ప్రాణం లేచి వచ్చినట్ట యింది. ఆమె చుట్టుపక్కల ఏమున్నదన్న ఆలోచన లేకుండా, అవతలికి దిగింది.



ఆ మరుక్షణం, ''దేవత ప్రత్యక్షమైంది! దేవత ప్రత్యక్షమైంది!'' అన్న పెద్ద కేకలు, ఆమెకు వినిపించినై.

ప్రియంవద ఒక క్షణం నివ్వెరపోయి, అలా కేకలు పెడుతున్నవాళ్ళెవరో తెలుసుకునేందుకు తల తిప్పబోయింది. కాని, ఆ క్షణంలోనే ఆమెకు స్పృహతప్పింది.

ప్రియంవద, యీ విధంగా స్పృహ కోల్పోయిన ప్రదేశానికి కొంత దూరంలో, శతనందన అనే గ్రామం వున్నది. ఆ గ్రామంలోని ప్రజలందరూ మూర్ఖులు. వాళ్ళ మూర్ఖత్వాన్ని ఆధారంగా చేసుకుని, గ్రామాన్ని యిద్దరు పెద్దలు ఏలుతున్నారు. ఆ గ్రామ ప్రజలకు, వాళ్ళేది చెబితే అది పరమసత్యం. వాళ్ళను అందరూ దేవతా స్వరూపులుగా భావిస్తారు. పండుగల్లో, అందరూ వాళ్ళకు కానుకలు సమర్పిస్తారు.

గ్రామంలో ఎవరికే కష్టం వచ్చినా, ప్రజలుముందుగా, ఆ పెద్దలకు చెప్పుకుంటారు. వానలు పడకపోయినా, ఎవరికైనా జబ్బు చేసినా—ఆ పెద్దలకు సవినయంగా మనవి చేయవలసిందే! వాళ్ళకు తెలియకుండా, ఎవరిళ్ళలోనూ, ఏ శుభ కార్యమూ జరగకూడదు.

శతనందన గ్రామ ప్రజల మూర్ఖత్వం ఎలా వుంటుందంటే—ఒకసారిశంకరయ్య అనేవాడి ఇంటికి నిప్పంటుకున్నది. అప్పుడు, ఇంట్లో వాళ్ళందరూ బయటికి వచ్చేశారు. మంటలార్పేందుకు ఎవరూ ప్రయత్నించలేదు. శంకరయ్య, ఏం



చేయాలని అడిగేందుకు పెద్దల ఇంటికి పరుగుతీశాడు.

ఆ సమయంలో పెద్ద లిద్దరూ మంచి గాఢనిద్రలో వున్నారు. శంకరయ్యకు వాళ్ళను నిద్ర లేపేందుకు కొంతసేపు పట్టింది. వాళ్ళు నిద్ర లేచి, విషయం తెలుసుకుని, వెంటనే నీళ్ళతో మంట లార్పమని ఆదేశించారు. ఇందువల్ల, పక్క ఇళ్ళకు అగ్నిప్రమాదం తప్పింది కాని, శంకరయ్య ఇల్లు మాత్రం పూర్తిగా కాలిపోయింది.

అప్పుడు పెద్దలు, శంకరయ్యతో, "నువ్వేదో పాపం చేశావు. ఆ పాపమే అగ్నిరూపంలో వచ్చి, నీ కొంప తగుల బెట్టింది. అయితే, నువ్వు మమ్మల్ని నమ్మావు. అందువల్ల, కొంపతోపాటు మనుషులు కూడా తగలబడకుండా కాపాడబడ్డారు. కొంప తగలబడితే, మళ్ళీ కట్టుకోవచ్చు; మనుషుల ప్రాణాలు పోతే మళ్ళీ రావు. అలాంటి వాటినే, మేము రక్షిస్తూంటాము," అని చెప్పారు.

శంకరయ్య వాళ్ళకు పడిపడి దణ్ణాలు పెట్టి వెళ్ళాడు.

ఆ గ్రామంలో, భీమయ్య అనే వాడి కొడుక్కు జబ్బు చేసింది. భీమయ్య, తన కొడుకును పెద్దలకు చూపించాడు. వాళ్లకు ఏదో కొద్దిపాటి వైద్యం తెలుసు. ఆ వైద్యంతో, అదృష్టమున్నవాళ్ళు బతుకు తారు; లేనివాళ్ళు పోతారు. భీమయ్య కొడుకు చచ్చిపోయాడు. అప్పుడు పెద్దలు, భీమయ్యతో, "నువ్వు పాపాలు చేశావు. ఆ పాపాలే మృత్యువు రూపంలో వచ్చి, నీ కొడుకును తీసుకుపోయాయి. ప్రపం చంలో, ఏ వైద్యుడూ నీ కొడుకును బతికించ గలిగి వుండేవాడు కాదు. వాడు, మా చేతుల్లో పోయాడు కాబట్టి, యిప్పుడు సరాసరి స్వర్గానికే వెళ్ళి పోయాడు. మరొక వైద్యుడి చేతిలో అయితే, మీవాడు నరకానికిపోయేవాడు," అని చెప్పారు. కొడుకు తనకు దక్కకపోయినా, కనీసం వాడు స్వర్గానికి వెళ్ళాడని, భీమయ్య ఎంత గానో సంతోషించాడు. —(ఇంకా ఉంది)






ప్రపంచంలో కెల్లా అత్యధిక సంఖ్యలో వన్యస స్తనజంతువులు టెక్సాస్‌లోని శాన్‌ఆంటోనియో, బ్రాకన్ గుహలో ఉన్నాయి. వేసవి కాలంలో ఈ లోయలో దాదాపు 20 మిలియన్ల గబ్బిలాలు గుమికూడతాయి!

## అతివేగంగల చేప

చేపలన్నిటిలోకి 'మార్లిన్' చేపలు అత్యధిక వేగంతో ఈదుతాయి. ఇవి గంటకు 40-50 మైళ్ళవేగంతో ప్రయాణం చేయగలవు.





## మంచుగుహ

ప్రపంచంలో కెల్లా అతి పెద్దదైన, ఎప్పుడూ మంచుతో నిండిన గుహ ఆస్ట్రియాలోని ఐస్రీసెన్ వెల్ట్‌లో ఉన్నది. దీని పొడవు 26 మైళ్ళు. ఈ గుహ ముఖద్వారం 3,300 అడుగుల ఎత్తు ఉన్నది. వేసవికాలంలో సైతం ఇక్కడి ఉష్ణోగ్రత మరీ అరుదుగానే ఘనీభవ స్థితిని దాటుతుంది.

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1987 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటింపబడును.



P. G. Viswanathan



P. G Viswanathan

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ ఫిబ్రవరి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/—లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: — చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

### డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: చిన్నవాడికి చదివెడు వరం! రెండవ ఫోటో: చిట్టెమ్మకు కడివెడు భారం!

పంపినవారు: పి. మనోహర్‌రావు, అంబర్‌పేట, హైదరాబాదు—500 013.

బహుమతి మొత్తం రు. 50/— నెలాఖరులోగా పంపబడుతుంది.



Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

## A BRIGHT NEW TRADITION IS BUILT by THE READERS OF

# THE HERITAGE

FEATURES AND FICTION FOR TODAY AND TOMORROW



The span of one and half years is not a long time, yet given will and goodwill, enough of a time to build a healthy, meaningful and intelligent reading tradition.

SLOWLY BUT STEADILY THE ELITE OF INDIA AND MANY LOVERS OF INDIAN CULTURE ABROAD ARE UNITING IN THE HERITAGE.

* THE HERITAGE reveals the fourth dimension of life to you—through series like *"The Other Experience"* and *"Fables and Fantasies for Adults"*.
* THE HERITAGE brings to you the best of creative literature of Contemporary India—stories, novels and poems.
* THE HERITAGE features pictorial articles on places and monuments delving into their *roots*.
* THE HERITAGE takes you to a tour of the *Little-Known India*.



# విజయచిత్ర

డాల్టన్ ప్రచురణ






ఇరవై సంవత్సరాలుగా సినిమా అభిమానులలో
ఉత్తమాభిరుచులను పెంపొందింపజేస్తున్న
మేటి సినిమా పత్రిక

## విజయచిత్ర

విడిప్రతి:రూ. 2.50

సాలుచందా: రూ 60.00

చందాలు బ్యాంక్ డ్రాఫ్టుద్వారా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజెన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు—600 026

A Super treat in every sweet!

SUPER SIZE! SUPER TASTE!

nutrine SuperStar

Premium toffees









TWIN TREAT

DELITE

TOP CREAM

Heavenly delights



nutrine భారత దేశంలో అత్యధికంగా అమ్మబడే మిఠాయిలు

న్యూట్రిన్ కన్ఫెక్షనరి కంపెని ప్రై. లిమిటెడ్, చిత్తూరు, ఆంధ్రప్రదేశ్

CLARION/NC/8636